శ్రీ



# సునందనచరిత్రము

ఇది

బాలురకును స్వల్పవిద్యాభ్యాసముగల స్త్రీ పురుషులకును

నుపయోగముగానుండునటుల

గుంటూరుజిల్లా బాపట్లకాపురస్థుడు

తిమ్మన కొండలరాయుడునాయుడుగారిచే

రచియింపబడ ప్రచురింపబడియె.


బి. కె. స్వామిచే

బెజవాడ వాణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1914.




[వెల రు 0-4-0.

# పీఠిక.

సోదరులారా!

నేను యీచరిత్రమును వ్రాయుటకు కొన్ని దినములకుముం దొకనాడు లోకములో కలహములేక నొకరికొకరు స్నేహముగానుండిన సర్వజనులును సుఖముగా నుందురుగదా యని నాకు తోచినది. అందుపైన పూర్వము ఋషులకు సాత్వికధర్మ మెక్కువగా నుండుటవలన వారియాశ్రమమందున్న పశుపక్ష్యాదులును క్రూరమృగములును తమ సహజవైరమును విడిచి అన్యోన్యానురాగముగలిగి నిర్భయముగా విహరించినట్లు గ్రంధములందు చెప్పబడియుండుట నాస్పృహకు వచ్చినది. అట్టి సాత్వికధర్మముగలిగి జనులు స్నేహముగా నుండకపోవుటకు కారణము తద్విషయవిచారణాభావముగా కనుపించుచున్నది. అట్టివిచారణ ప్రజలయందు పురికొలుపుటకొరకు బ్రాహ్మణోత్తములవలన నేను తెలిసికొనిన ముఖ్యమయిన యంశము లొకకథయందిమిడ్చి నానేర్పుకొలది వ్రాసినాడను.

**నోటు—అభావము=లేకపోవుట.**

2. మనుష్యుడు మతస్థుడయినచో లోకమునకు మేలును, అమతస్థుడయినచో కీడును కలుగజేయును. కాబట్టి ముందు మతములనుగురించి చెప్పవలెనుగనుకను, ముఖ్యమైన సర్వమతముల సిద్ధాంతములు బౌద్ధ, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతములందిమిడియున్నవని నా తాత్పర్యము గనుక ఆయామతములయొక్క పరస్పరభేదములు బోధపడుటకు నాకు

దెలిసినంతవరకు క్లుప్తముగా వ్రాసినాడను. అందలి నాలోపములకు మన్నించ వేడుచున్నాను.

3. మఱియు శ్రుతిస్మృత్యాదివిద్యలయొక్క వివరము చెప్పుటద్వారా వానియొక్క గొప్పతనమును సంపూర్ణత్వమును తెలుపదలచి అట్టివివరమునుకూడ స్వల్పముగా వ్రాసినాను.

4. ప్రతిమనుజుడును దా నితరులను ప్రేమించుటవలన తనకుగలుగు సుఖమునకంటె మరిదేనివలనను నీలోకమునందెక్కువ సుఖముగలుగదనియును అట్లితరులను ప్రేమించు నభ్యాస మెట్లుజేసికొనవలెనో యట్టి విధాన మిందు దెలిపితిని.

5. కాబట్టి యీచిన్నపుస్తకమందున్న గుణములు పైచెప్పబడిన పెద్దలవిగాను దోషములు నావిగాను యెంచి గుణములను గ్రహించి దోషములను పరిత్యజించి నన్ను మన్నింప ప్రార్థించుచున్నాడను.

బాపట్ల, 1914.

ఇట్లు తమవిధేయుడు,
తిమ్మన కొండలరాయుడు.

మ. రా:—ఈపుస్తకములోని యింగ్లీషువాక్యముల ముఖ్యాభిప్రాయము తెలుగున వివరించేయున్నాను, గనుక ఆభాష రానివారు వాటిని విడిచిపెట్టినను లోపములేదు.

# విజ్ఞాపన.

క॥ శ్రీపతియగు యదుపుత్రుం
డాపదలనుబాపి మమ్ము-ననవరతంబున్
భూపతనమైన దాదిగ
మా పితవలె పోషణంబు-మరిమరి జేయున్॥ 1

తే॥ గీ॥ లోపమేమిక మాకును-లోకనాథు
డుండియుండగ గాపాడ-దండిగాన
టంచు మదినెంచి నేనొక-హరికథనము
వ్రాయబూనితి నామది-వాంఛదీర॥ 2

తే॥ గీ॥ కవితమును జెప్ప నాదగు-కార్యమదియు
గాదు నిరతముజూడంగ-ఘనులు మెచ్చ
తనివిదీరంగ శ్రీసునం-దనునికథను
జెప్పినాను నీ బద్యంబు-లొప్పుగనరె॥ 3

శ్లో॥ నాహంవసామి వైకుంఠే నయోగిహృదయేరవౌ
మద్భక్తాయత్ర గాయంతి తత్రతిష్టామినారదా॥ 4

వ॥ అని స్వామి సెలవిచ్చియున్నారు గనుక మనమెల్లరము
స్వామిధ్యాననిమగ్నులమై భగవత్సంకీర్తన గావించవ
లయును. 4A

క॥ అనిశము హరిసేవించిన
జననము మరణమును శోక-జగతిని నెప్పుడున్
ఘనమగు సుఖములుగలుగుట
కనుమానము లేదు లేశ-మవనిని ప్రజకున్॥ 5

వ॥ అయ్యా, పైపద్యములోని "సేవ" యనునది యేమి
యని విచారించిన సర్వేశ్వరుని సదా అవిచ్ఛిన్నమై
న ధ్యానముచేసి వారి సాక్షాత్కారమును బొందునది
యొక సేవ, మరియు వారియందు భక్తినుంచి వారి
వలన గలిగిన శ్రుతిస్మృత్యాది గ్రంథములయందు జెప్ప
బడిన "విధి", "నిషేధముల" ప్రకారము నడుచుకొను
ట యొక సేవ. మనుజులు వీని రెంటిని జేసి కృతార్థులు
కావలెనని తాత్పర్యము. 6

తే॥ గీ॥ ఇట్టుల సేవలు ప్రాణుల◆కీశ్వరునకు
జేసి యిహపరసుఖముల◆జెందిరి మిగుల
వాసికెక్కిన యొక ధర◆పాలకుండు
రాజ్యమొనరించె యుత్తర రాష్ట్రమునను॥ 7

(ఆఖరు పేజీలోనున్న మోక్షవృక్షమును చిత్తగింపుడు)

వ॥ సోదరులారా! 8

తే॥ గీ॥ చెప్పుచున్నాడ నాకథ◆దప్పులున్న
వాని నిరసించి నాదగు◆నాఖదీస
నందు జెప్పిన గొప్పైన◆ననవరతము
బ్రాణులకు బ్రీతి జేయంగ◆ప్రణుతిసేతు॥ 9





# శ్రీసునందన చరిత్రము.

కథా ప్రారంభము.

తే॥ గీ॥ శ్రీయుతంబగు పాటలీ శ్రేష్ఠపురము
పూర్వమొక భూపుఁ డేలుచుం బుడమియందు
పొందుమీరఁగ ప్రాణులయందునతఁడు
దయనుజూపుచునుండెను ధర్మమెసఁగ॥ 10

తే॥ గీ॥ ఘనతఁజెందిన యాగుణాగ్రణుని రాజ్య
మందు వెలఁగిరి పండితు లమలమతులు
దండిగా వారికిందరుం ద్గంశులనెడి
బిరుదములొసఁగఁగ బెద్దగుం బేర్మినపుడు॥ 11

క॥ ద్వైతాద్వైతవిశిష్టా
ద్వైతము మరినాదమతము ధరలో మిగులన్
ఖ్యాతిఁగ పఠనము జేసిరి
జాతకసంధిసాటిం చదువరులడలన్॥ 12

తే॥ గీ॥ సిరిభూసురులగుటచే వినయముగను
తనకుసంస్థానమందు సత్కారణమొసఁగి
మీఱియుండినవిద్యల సారములను
ప్రభుఁడు నేర్చెను మిక్కిలి ప్రబలముగను॥ 13

క॥ ఒక్కొక్క పండితుండిల
నొక్కొకమతబోధ సేయ నొక్కొకరీతిన్
మక్కువతర్కముసలుపగ
నొక్క సభకు వారిగూర్చి యురుతరభక్తిన్॥ 14

వ॥ అప్పుడు రాజాసభయందు బౌద్ధమతము ప్రబలియుండ
గా దానిని ఖండించుటకు శ్రీశంకరులవారవతరించినట్లు
ను తరువాత రామానుజులవారు అద్వైతమతమునిూ
ద ఖండన వ్రాసినట్లును తెలియుచున్నది గనుక ముం
దుగా:— 15

ఆ॥ వె॥ బౌద్ధమతము మనకు బరగ నేమని జెప్పె
బుధవరేణ్యులార పుడమియందు
బోధ సేయరయ్య పొందుగ దెలియంగ
బౌద్ధమతములోని బలము నెల్ల॥ 16

వ॥ మరియు మనుష్యుడు ప్రత్యక్షఅనుమాన ఉపమాన
శబ్దప్రమాణములనుబట్టి ఆత్మ, జీవుడు, ప్రకృతి ఇవి
యున్నట్లు తెలిసికొనుచున్నాడు. గనుక వీనినిగురించి
ప్రతిమతమును తెలుపవలసయున్నది. కాబట్టి బౌద్ధమత
మేమని చెప్పునని రాజు ప్రశ్నించగా బౌద్ధ పండితుం
డిట్లనియె॥ 17

## బౌద్ధమతము.

తే॥ గీ॥ ఆత్మవస్తువు వేరొక్క డమరియుండ
లేదటంచును జెప్పెను లెస్సమిూర

నసుభవంబునగన జీవుండందరకును
బాహ్యమేగద యనిజెప్పె బౌద్ధమతము॥ 18

క॥ రక్షణలయములసృష్టిన్
గుక్షింగల ప్రకృతియందుఁ గూరిమిమీరన్
పక్షులు పసువులు మొదలగు
నక్షరములు క్షరములుండు ననవరతంబున్॥ 19

క॥ స్వాభావికముగ మహిమము
లాభాసముగాక ప్రకృతి యందుననుండున్
ఏభావముగనుగాంచిన
సంభారపుసృష్టిలయము లెడ తెగకుండన్॥ 20

తే॥ గీ॥ వస్తుసమ్మేళనంబున వరుసగాను
జీవుడేర్పడె ప్రకృతిలోఁ జింత జేయ
సుఖులుసల్పెడు దుష్కృత సుకృతములను
బట్టియుండును మనిషి బ్రతుకుసరళి॥ 21

ఆ॥ వె॥ జీవహింస నిలను జేయరాదెప్పుడు
జీవకోటికెల్ల జేయుహితము
జారచోరముఖ్య ఘోరముల్ సల్పిన
ఫలముకష్టదని బౌద్ధమతము॥ 22

ఆ॥ వె॥ కాన కష్టములను గన్నకోర్కెల
పాపపుణ్యకర్మ సంతతిసల్పి
పుట్టి చచ్చి మరల బుట్టుచు జచ్చుచు
భ్రమణమొందు చక్రభంగి నెపుడు॥ 23

తే॥ గీ॥ పుడమి దేహాభిమానంబు • పోనడంచి
కర్మబంధవిముక్తుడై • కలక దేరి
సన్యసించుచు బహుదుఃఖ • జనకమైన
జననమరణపరంపరల్ • చంపవలయు॥ 24

వ॥ దీనినే బౌద్ధమందు నిర్వాణమని చెప్పుదురు. నిర్వాణమనగా జననమరణబాధలు లేక జీవుడు నశించిపోవుటే యని తాత్పర్యము. ఇట్లు బౌద్ధమతస్థుడు చెప్పిన తరువాత రాజిట్లనియె॥ 25

గీ॥ మతములందున నద్వైత • మతముమిగుల
హితముగా జెప్పి యజ్ఞాన • హతము జేయు
విధముజూపరె మీరిట • విప్రవర్యు
లనుచు భూపతి భక్తి • నడిగినపుడు॥ 26

వ॥ అనిన విని యద్వైతపండితుండిట్లనియె॥ 27

## అద్వైతమతము.

సీ॥ సచ్చిదానందంబు • సరగనానంతంబు
సర్వమువ్యాపించి • సరసులార
సర్వజ్ఞమును తాను • సగుణంబుగానిది
యాదియందొక యాత్మ • యనరియు
బరగ రెండవదియున్ • బ్రపంచమందున లేక
బ్రహ్మాండమంతయు • భరితమయ్యె
శ్రుతిదీనియాత్మగా • సొంపునబోధింప
ధీమంతులందరు • దెలిసికొనిరి

తే॥ గీ॥ అచలమై యున్న యాయాత్మ యలరగాను
సృష్టి జేయగ లేదంచు జెప్పబడియె
నమర నద్వైతమతమునం దార్యులార
వినరె వీనులకింపుగా విహితులార॥ 28

తే॥ గీ॥ మాయతనయందు నిమిడింప మహిమనిలచె
మాయలోపల తాదూర మహిమతగ్గ
మాయ చేచుట్టబడినట్టి మంచియాత్మ
జీవుడనటంచు వేరుగ జెప్పచుండు॥ 29

వ॥ ఆజీవుడు, 30

క॥ ఇదిపటము యిదిఘటంబని
మదినెంచును మాయ చేత మరియుజగతిన్
కదిలునది కదలకుండిన
నదియంతయు యాత్మయనెడి న్యాయమెరుగకన్॥ 31

తే॥ గీ॥ అది లేనట్టి యజ్ఞాన మమరియుంట
నాత్మతానుగా జీవున కనుభవంబు
లోపమాటను నీమాయ లోకమందు
బుట్టిచచ్చుచు బాధల బొందుచుండు॥ 32

ఆ॥ వె॥ జీవుడెపుడుతనను జెప్ప ననాత్మగ
జ్ఞానశూన్యుడౌను గాననతడు
ఇంగితంబుగలిగి యీసృష్టిజూచిన
నాత్మసత్తనాత్మ యగునుమిధ్య॥ 33

వ॥ ఏమయాయిది! బాధవలె ప్రపంచము కనుపించుచుండ
గా మిధ్యయని చెప్పెదరేమి? యని యడిగిన॥ 34

క॥ అత్యంతభక్తిశ్రోడుత
నిత్యముశివపూజ జేసి•నిర్మలమతులై
సత్యము ద్వివిధమటంచు న
గత్యముజెప్పెదరు పద్య•గద్యములాదున్॥ 35

క॥ వ్యవహారపారమార్థిక
మవనింగల రెండుగతుల•నరయును వేగన్
వ్యవహారదశనుగలిగెడు
నవి పరమార్థమున లేక•యాశ్చర్యముగన్॥ 36

సీ॥ కావున పురుషుండు•గడగంగ బ్రహ్మచ
ర్యముగాంచి గురు•విద్యనభ్యసించి
ఆశ్రమంబులుతాను•విశ్రాంతి లేకయు
నమరంగజరుపుచు•ననవనియందు
తగినమార్గంబున•ధన్యుడై యొకండు
తత్వమాదాస•దగులవలయు
సర్వభూతంబుల•సమముగాజూచుచు
కర్మవిముక్తుడై•కడకుతాను

తే॥ గీ॥ దేహమందభిమానబు•ద్ధినిత్యజించి
జీవపరమాత్మలకభేద•భావమొనర
దేల్చి యవనిని నెంతయు•తెలివిగలిగి
తిరుగవలయును సద్వైతి•తెంపుమీర॥ 37

క॥ జీవేశ్వరులకుభేదము
నీవే లేదనుచుదెలిసి•నిర్మలముగనా
జీవేశాభేదమతము
భావంబునబుట్ట జీవ!•భ్రాంతినశించున్॥ 38

తే॥ గీ॥ జీవ! భ్రాంతినశించిన • జీవుడెపుడు
బాహ్యమందున బ్రహ్మను • బరగజూచి
జీవజీవుల భేదంబు • జెప్పకుండు
నిత్యమానందమయముసై • మించియుండు॥ 39

తే॥ గీ॥ బాహ్యమందున బ్రహ్మను • బరగజూచి
మోక్షమందును జీవుడు • ముదముతోడ
జీవ! భ్రాంతినశించిన • జెలువుమీర
యాత్మనిలిచెసి నానంద • మైనగితిని॥ 40

వ॥ అని యిట్లు అద్వైతమతమును గురించి విని ప్రభువు
ఆనాటికి సభముగించి అంతఃపురంబునకుం జనియె॥ 41

క॥ ఇట్టుల బోధలు వినుచును
గట్టిగ నా రాజుతనదు • కాముమగ పసన్
పట్టంపుదేవి పుత్రులు
పట్టగ వేదంచు దుఃఖ • పూరితమతియై॥ 42

ఆ॥ వె॥ ప్రాణనాథమునకు • బరగ సంతతి లేక
పోయె నింతవరక • పుణ్యమేమొ
సంతతి లేనుతమకు • సంతాప మొదవిట్టి
వింతజూడ నాకు • చింతగలుగు॥ 43

తే॥ గీ॥ ఇంతిరో విను నే చెప్పు • హితము వెల్ల
కామజనకుని కృప చేత • గలుగు సంతు
గాన వేదుము సతతంబు • గానలోలు
మానసంబున దుఃఖంబు • మరచి నీవు॥ 44

క॥ జపములు తపములుసఁబుచు
విపరీతముగాను మంత్ర•విద్యలచేతన్
అపరిమితౌషధములచే
నుపచారము జేసిరప్పు•డు హితముగానన్॥ 45

వ॥ ఇదియునుంగాక వారిరువు రనేకవిధంబుల నీశ్వరుని
బ్రార్థించి రెట్లనిన॥ 46

తే॥ గీ॥ పుత్రసంతతి లేకున్న•పుడమియందు
గతులు లేవసిబల్కి రి•ఘనులుముందు
పొందమందున దయఁజూపు•నందనంద
నా యటంచును వేడిరా•నందమయుని॥ 47

క॥ హేనాథయనుచు నిరతము
శ్రీనాథునిపూజ జేసి•చిత్తములందున్
ఆనాథు వేడి రెటులన
ప్రాణాధారమునుజూపు•ప్రభువాయనుచున్॥ 48

మత్తకోకిల.

పుత్రలాభము లేనిమాయెడ•పుణ్యమించుకఁజూపి మా
పత్రశయ్యనువీడి మాగృహా•పావనంబునుసల్పవే
మిత్రభావముతోడ మామొర•మీరుమీనుల జేర్చుచున్
పుత్రభిక్షమునిచ్చి మమ్మిట•పోవ ణంబిక జేయవే॥ 49

వ॥ అని యీవిధంబున నీశ్వరుని బ్రార్థించగా కొన్ని దినంబు
లకు॥ 50

క॥ మరిమరి వేడగ దేవుని
పరమానందమునుబొందఁ పతిసతులంతన్
వరమొసగినట్లు నాసతి
కరివరదునికరుణచేతఁ గర్భముదాల్చెన్॥ 51

తే॥ గీ॥ భూమిలోఁగల ప్రజలెల్ల బుడమిరేడు
మదినిఁనానందమునుబొందిఁ మరచిరోడలు
అంతసంతసమందుచుఁ కాంతలమర
నూడిదంబు దెచ్చియిచ్చిరిఁ సుదతికపుడు॥ 52

తే॥ గీ॥ నూటిగానప్డు సీమంతఁ శుభముజరిపి
విమలమైనట్టి వస్త్రములమరగాను
యీప్డులొసగను గురుదేవుఁ డెల్లరకును
గేయముగురీతి జనులు రాఁ ధేయుడనగ॥ 53

వ॥ గురుదేవుడను పేరుగల పాటలీపురపురాజు భార్య యీ విధముగ కాలముగడపుచుండ నాప్రభువు తిరిగియు పండితులసభజరిగించి యాసభయందు॥ 54

తే॥ గీ॥ మతములందున వైష్ణవఁ మతముమిగుల
శ్రేష్ఠమంచును జెప్పిరిఁ సృష్టిలోన
భక్తి వైరాగ్య జ్ఞానముల్ బరగనొసగు
సత్త్వమతిమనుదెల్పరేఁ యనగనపుడు॥ 55

వ॥ అనిన విని యామతమును సాధింపబూని యొకభూసురుం డిట్లనియె॥ 56

## విశిష్టాద్వైతము.

సీ॥ సచ్చిదానందుండు • సామియనంతుండు
సర్వరూపమువాడు • సరసులార
సర్వజ్ఞుడును తాను • సగుణుడుగానున్న
యాదియంతో కయాత్మ • యమరియుండె
అట్టిది వేరొక్క • టటులేక మొదటను
నొక్కటియుండెను • మిక్కుటముగ
నాదిదెలియనట్టి • యలచిదచిత్తుల
స్వేచ్ఛగ నాతడు • జేరగానె
తే॥ గీ॥ స్థిరచరంబులునన్నియు • వరుసగాను
సృష్టిగలిగెనటంచును • జెప్పబడియె
నటుల వైష్ణవమతమున • నార్యులార
వినరె వీనులకింపగు • విధముగలుగ॥ 57
తే॥ గీ॥ ప్రకృతిజీవేశభేదముల్ • ప్రముఖముగను
మనకుజెప్పెను వైష్ణవ • మతమునందు
జీవరాసుల భేదంబు • జెప్ప లేదు
జెప్పలేదయ్య భేదము • జీవులకును॥ 58
వ॥ అనగా మోక్షావస్థయందు పశుపక్షిమృగాది భేదము
న్ను స్త్రీ పురుష భేదము లేదనిన్ని జీవులకు మోక్షము
నందు ఆనందతారతమ్యము లేదనిన్ని తాత్పర్యము. 59
సీ॥ విభుతత్వమణుతత్వ • విభజనల్ జేసిరి
తత్వముల్ రెండని • ధన్యులార
విరటి రేయీశుడు • విభుతత్వమున జేరు
జీవుండు నణువుల • జేరునమర

శృంగారమొప్పగ॰సృష్టిజేసెనుహరి
జేయజాలడుసృష్టి॰జీవుడెవుడు
సామికిబినుకుండె॰సర్వజ్ఞుడంచును
జీవి కించిజ్ఞుడు॰జెప్పనేల

తే॥ గీ॥ ఈశుతత్వముగానిది॰యెన్నలక్ష్మి
లక్ష్మియప్పుడు జీవాణు॰లతనుజేరు
గాన స్త్రీపురుషాళికి॰గలదుమిగుల
ధరణిభేదము లేదది॰పరమునందు॥ 60

క॥ పాషాణవృక్షపక్షులు
మేషాదికమృగములెల్ల॰మేదినిలోనన్
పోషింపబడుచునొందును
భాషింపగనరులజన్మ॰పావనమొదవన్॥ 61

తే॥ గీ॥ మోక్షమందునుజీవుడు॰ముదముతోడ
పక్షివాహనుసతియెక్కు॰పరమకృపను
విష్ణురూపముతోడుత॰వెలుగుచుండు
వేరెరూపము లేకను॰వెదకిజూడ॥ 62

ఉ॥ జీవుడు జేయునిల్లు తన॰చేష్టలపుణ్యము పాపపుంజముల్
గావునబొందుచుండు నర॰కంబునసద్గతినందు దుఃఖసౌ
ఖ్యావరణంబు విమ్మటను॰ఖ్యాతినిగాంచగ భూమిలోపలన్
భావముతోను తాదిరుగు॰భారపుచక్రమురీతి నెప్పుడున్॥63

సీ॥ కావున పురుషుండు • గడగంగ బ్రహ్మచ
ర్యముగాంచి గడువిద్య • నభ్యసించి
ఆశ్రమంబులు తాను • విశ్రాంతి లేకను
యమరంగ జరుపుచు • నవనియందు
తగినమార్గంబున • ధన్యుడై యెప్పుడు
తనను దాహరియందు • ధారబోసి
సర్వభూతంబుల • సమముగా జూచుచు
కర్మవిముక్తుడై • కడకు తాను

తే॥ గీ॥ దేహమందభిమానబు • ద్ధినిత్యజించి
జీవపరమాత్మభేదంబు • భావమందు
దేల్చి యవనినియెంతయు • దెలివిగలిగి
విష్ణుమతసక్తుడెప్పుడు • వెలుగుచుండు 64

సీ॥ పరమకృపాగుణ • పరిపూర్ణుడైనవాని
శరణాగతత్రాణ • బిరుదువాని
నామకళ్యాణగు • ణంబులుగలవాని
విష్ణుదేవునిలక్ష్మీ • విభునినమర
మనమందవిచ్ఛిన్న • మననముగావించి
ధ్యానంబు జేసిన • ధన్యులకును
సాలోక్యసామీప్య • సారూప్యసాయుజ్య
ములుగల్గి జీవికి • ముదముగూడ

తే॥ గీ॥ నన్యభావము లేకుండ • నాత్మనుండి
సేవ జేసిన వానికి • సిద్ధముగను

జననబాధలు లేనట్టి॰జయముతోన
ఖండమైన యానందము॰గలిగియుండు॥ 65

వ॥ ఇట్లు విశిష్టాద్వైతమతమును విని రాజిట్లనియె॥ 66

శా॥ ఈరీతిన్విని మెచ్చి శాంతముగ తా॰ నెంతో ముదంబొప్పగా
నారాజేశ్వరుడప్పుసార్థకవిశి॰ష్టాద్వైతమేయంచికన్
ధారాళంబుగ నాకుజక్కగను యా॰ద్వైతంబు బోధించరే
శ్రీరాగోరుచు నాదుమానసము రం॰జిల్లంగ నెల్లప్పుడున్॥

వ॥ అనినవిని ద్వైతమతబోధ సేయంబూని యొక బ్రాహ్మ
ణుం డట్లనియె॥ 67

సీ॥ సచ్చిదానందుండు॰శాంతిమయుండుస
ర్వవ్యాపియైయుండు॰భవ్యులార
సర్వజ్ఞుడును తాను॰సగుణుడుగానున్న
యాదియందొకయాత్మ॰యమరియుండె
నట్టిది వేరొక్క ॰టటులేక మొదటను
నొక్కటియుండెను॰మిక్కుటముగ
నాదిశూన్యంబై న॰యులచిదచిత్తుల
సమ్మేళనము జేసి॰సర్వమహిమ

తే॥ గీ॥ స్థిరచరంబులనన్ని యు॰తీరుగాను
సృష్టి జేసెనటంచును॰ జెప్పబడియె

నటులద్వైతమతంబున • నార్యులార
వినరె వీనులకింపుగ • విహితులార॥ 68

తే॥ గీ॥ జీవరాసుల భేదంబు • జెప్పబడియె
జెప్పబడియెను భేదము • జీవులకును
ప్రకృతిజీవేశ భేదముల్ • ప్రముఖముగను
మనకు జెప్పంగబడె ద్వైత • మతమునందు॥ 69

సీ॥ విభుతత్వమణుతత్వ • విభజనల్ జేసిరి
తత్వముల్ రెండని • ధన్యులార
వింటిరేయీశుడు • విభుతత్వమున జేరు
జీవుడుయణువుల • జేరునమర
శృంగార మొప్పగ • సృష్టి జేసెనుహరి
జేయజాలడుసృష్టి • జీవుడెపుడు
సామికిబిరుదుండె • సర్వజ్ఞుడంచును
జీవి కించిజ్ఞుడు • జెప్ప నేల

తే॥ గీ॥ ఈశుతత్వములోనిది • యెన్న లక్ష్మి
లక్ష్మి జేరదు జీవాణు • లతనువినరె
గాన స్త్రీపురుషాళికి • గలదుమిగుల
ధరణి భేదము మరియును • పరమునందు॥ 70

క॥ పాషాణవృక్షపక్షులు
మేషాదిక మృగములెల్ల • మేదినివరుసన్

పోషింపబడుచునుండును
భాషింపగనరులజన్మ•పావనమొదవన్॥ 71

తే॥ గీ॥ మోక్షమందునుజీవుడు•ముదముతోడ
పక్షివాహనుసతియొక్క•పరమకృపను
విష్ణుచిహ్నలతోడుత• వెలుగుచుండు
రాశిరూపముదాల్చియు•రమ్యముగను॥ 72

వ॥ రాశిరూపముఅనగా జన్మకుపూర్వమందు ఆజీవుడు యే
రాశిలోనివాడో అనగా నర, మృగ, పశు, పక్ష్యాదు
లలో యేజాతిరూపముగలిగియుండినవాడో ఆయాజాతి
స్త్రీ, పురుషరూపములతో మోక్షావస్థయం దుండున
నిన్ని వారివారికి ఆనందతారతమ్యముకూడాకలిగియుం
డుననిన్ని తాత్పర్యము. 73

ఉ॥ జీవుడు జేయునిట్లు తన•చేష్టలపుణ్యముపాపపుంజముల్
గావునబొందుచుండు నర•కంబునసద్గతినందు దుఃఖసౌ
ఖ్యావరణంబు పిమ్మటను•ఖ్యాతినిగాంచగ భూమిలోపలన్
భావములోను దాదిరుగు•భారపుచక్రమురీతి నెప్పుడున్॥

సీ॥ కావునపురుషుండు•గడగంగ బ్రహ్మచ
ర్యముగాంచి గడువిద్య•నభ్యసించి
ఆశ్రమంబులుతాను•విశ్రాంతిలేకను
యమరంగజరుపుచు•నవనియందు

తగినమార్గంబున♦ధన్యుడై యెప్పుడు
తననుదాహరియందు♦ధారబోసి

సర్వభూతంబులు♦సమముగాజూచుచు
కర్మవిముక్తుడై♦కడకుతాను

తే॥ గీ॥ దేహమందభిమానబు♦ద్ధిని త్యజించి
జీవపరమాత్మభేదంబు♦భావమందు
దెల్పి యవనినియంతయు♦ తెలివితోడ
ద్వైతమతసక్తుడెప్పుడు♦ధన్యుడగును॥ 75

సీ॥ పరమకృపాగుణ♦పరిపూర్ణుడైనవాని
శరణాగతత్రాణ♦బిరుదువాని

రూపనామాదులు♦రూఢిగాగలవాని
విష్ణుదేవుని లక్ష్మీ♦విభునినమర

మనమందవిచ్ఛిన్న♦మననముగావించి
ధ్యానంబుజేసిన♦ధన్యులకును

సాలోక్యసామీప్య♦సారూప్యసాయుజ్య
ములుగల్గి జీవుడు♦మోదముతో,

తే॥ గీ॥ నన్యభావముతోడుత♦నాత్మనెపుడు
సేవజేసినవానికి♦సిద్ధముగను
జననబాధలు లేనట్టి♦జయముతోన
ఖండమైనయానందము♦గలిగియుండు 76

వ॥ ఇంతవరకు ప్రభువు బౌద్ధ, అద్వైత, శివిష్టాద్వైత, ద్వైతమతములయొక్క సాంప్రదాయములను గ్రహించినవాడై, యితరమతములనుగురించికూడా తెలిసికొన ప్రయత్నముచేయుచుండెను. ఇక రాజు భార్యయొక్క స్థితి యేమనగా॥ 77

మ॥ నవమాసంబులుపూర్తిజేసిపిద•పన్ నారీశిరోరత్నమీ
భవవారాన్నిధిదాటజేయుకొర•కున్ భక్తాగ్రగణ్యుండనన్
దివసారంభమునందు తేజరిలగన్• దివ్యజ్ఞు బాలునిన్
లవలేశంబును బాధలేక గని•యెన్ లావణ్యమూరు స్థరన్॥

చ॥ తనయుడుగల్గెనంచు తలి•దండ్రులు మిక్కిలి సంతసంబునన్
మనములయందు పెక్కులగు•మార్గములన్ తమయూహలన్నియున్
వినయముతోడ శ్రీహరికి• వెల్లడిజేసిభజించుచున్ ధరన్
అనయముబీదసాదలకు• నన్నముబెట్టిరి యార్తిదీరగన్॥ 78A

వ॥ ఈప్రకారము సంతోషముచేత భూతతృప్తి జేసి మరియు ననేక వేడుకలుసల్పి అబిడ్డయొక్క అందమును జూచి శ్రీరామచంద్రమూర్తికి పోల్చుకొనుచు వారిని గూర్చి త్యాగయ్యగారు బాడినట్టు 79

ఆ॥ వె॥ ఎంతముద్దుబాలు•డెంతసొగసువాడు
ఎవరికైనదరమె•యెంచిజూడ
ఎంతవారికైన•వింతకామముబుట్టు
కాంతలార వీని• కాంతిగనరె॥ 80

ఆ॥ వె॥ దినదినమునవృద్ధి• తేటగాఁగనుపింప
పెరిగ బాలుడవుడు• ప్రేమగొలుప
ఐదువత్సరంబు•లతనికిరాఁగని
విద్యనొసగుమనిరి•విహితులెల్ల॥ 81

తే॥ గీ॥ అక్షరాభ్యాసమయినది•యాదిగాను
శిక్ష లేకుండజదివెను•చిన్నియన్న
పక్షివాహానుకృప చేత•పరమప్రీతి
గుక్షిజేర్చెనువిద్యల•గూర్మినపుడు॥ 82

తే॥ గీ॥ అన్నివిద్యలయందత•డమరగాను
వన్నెకెక్కెనుదగ కరి•వరదుకృపను
రాజ్యమును చేతబూనంగ• రాజసుతుడు
సిద్ధముగనుండెనప్పుడు•బుద్ధిమిగుల॥ 83

వ॥ ఇట్లు రాచకొమరుడు విద్యలనెల్ల నభ్యసించినవాఁడా
యెను. ఏలనన. 84

ఉ॥ విద్య నిగూఢగుప్తమగు•విత్తము రూపము పూరుషాళికిన్
విద్యయశస్సు భోగకరి•విద్యగురుండు విదేశబంధువున్
విద్య విశిష్టదైవతము•విద్యకుసాటిధనంబులేదిలన్
విద్య నృపాలపూజితము•విద్యనెరుంగనివాడు మర్త్యుడే॥ (భర్తృహరి)

వ॥ విద్యయనగా శ్రుతి, స్మృతి, పురాణ, ఇతిహాసములు. ఇందు శ్రుతియనగా ఋగ్వేద యజుర్వేద సామవేద అధర్వ వేద మను నాలుగు వేదములు. ఇందొక్కొక్కటి సంహితలు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు అని మూడేసిభాగములుగా భాగింపబడియున్నవి.

వ॥ అంత బ్రాహ్మణులకు రాకొమరునియొక్క పటమును వ్రాసియిచ్చి అనేక దేశముల రాజులకు పంపగా నొక దేశపు రాజుకుమార్తె వీనియందు మోహముగలదై వీని నెట్లయినను పెండ్లియాడవలెనని సంకల్పించుకున్నది. ఇక నచట పాటలీపురమందున రాజుగారు. 92

క॥ మరియు ననేక మతంబుల
మరిమరిశోధించి రాజు • మర్మముదెలియన్
గురుతుగదలచెను మదిలో
పరిపరివిధములనుజూచి • ప్రాజ్ఞుండగుచున్॥ 93

క॥ అన్ని మతంబులసారము
తిన్నగజూడంగ నొకటె • దెల్పును భువిలో
నన్నా యేమతమయినను
క్రన్నన నొకదేవు జేరు • క్రమముగురీతిన్॥ 94

క॥ ఇలనుగల యెల్లజీవుల
కల పరమేశ్వరుడొకండె • యాధారమగున్
పలుపేర్ల వెలసి భువిలో
పల శివ అల్లా యెసుడన • బరగిననెనన్॥ 95

వ॥ అనిచెప్పి మరియు నిట్లనియె॥ 96

తే॥ గీ॥ అన్ని మతములలో నెల్ల • నమరియున్న
సత్యమొక్కటి జూడంగ • సరసమగును
పిన్నగుణములచేనిట్లు • పెనగులాడ
తగదని బుధులు చెప్పిరి • తత్త్వమెరిగి॥ 97

క॥ ద్వైతాద్వైతవిశిష్టా
ద్వైతముల న్ప్రొద్ధమందు•ధరనితరమత
వ్రాతములు జేరుచున్నవి
గౌతమి ముఖనదులు కడలి•గలిసెడురీతిన్॥ 98

క॥ కావున మనుజుండేమత
భావంబుననున్నగాని•బహుదయగలస్వా
భావికగుణములబొందెడు
యేవిధమునజూడ పాప•మెరుగకభువిలో॥ 99

క॥ పురుషుడమత స్తుడైనను
పరుషంబులుబల్కి మిగుల•పరవశుడై తా
పరులకు పీడనుసల్పును
హరిహరులకు వెరువకుండి•యనిశముజూడన్॥ 100

వ॥ పురుషుడు మత స్తుడయినయెడల లోకులకు ఉపకార
ము చేయుననిన్ని అమత స్తుడయినయెడల లోకులకు
అపకారిగానుండుననిన్ని చెప్పియుంటిని. అయితే లోక
ములో మనుష్యులు యేదోయొకమతమునందు జేరిన
వారై బాహ్యచిహ్నములు అనగా బొట్లు, జుట్లు, క
ట్లు వగయిరాల నుంచుకొని మత స్తులుగా నున్నారు
గదా యని యుందురేమోగాని వారు ఆయామతబో
ధిత:నీతులను క్రమముగాజరుపు నభ్యాసము లేనివారు
గా నున్నారు. గనుక ప్రయోజనము లేక యున్నది.
కాబట్టి యావన్మందియు తమతమమతములయందు శ్ర
ద్ధాభ క్తిగలవారై కానివొప్పున యెరుకగలిగిసంచరిం

చినచో కృతార్థులుకాగలరు. అని యీవిధంబున గురు
దేవమహారాజు ప్రజలకు బోధించుచునుండెను. ఇట్లు
రాజు కాలముగడుపుచుండ రాకుమారుడుచదువరియై
నను సప్త వ్యసనములలో నొకటయిన వేటవ్యసనము
నకు లోనై వేటకు వెడలినవాడాయెను. 101

తే॥ గీ॥ రాజపుత్రుడు మిక్కిలి॰ రాజసమున
వేటలాడంగనూహించి॰నీటుమీరు
రవుతులనుగూడి యడవికి॰రమ్యముగను
బోయె రాజాజ్ఞనప్పుడు॰బొందితాను॥ 102

క॥ అడవికిబోయెను వెంటని
బడలకయనకుండ మిగుల॰బరవశుడై తా
బెడిదపు మృగములజంపను
వడిగలనాయుధము లెల్ల॰వంటనుదాల్చెన్॥ 103

మ॥ ఫలవృక్షంబులతోడగూడి మిగులన్॰భద్రంబుగా నున్నచో
టుల నీరంబులు మెండుగాగలిగినీ॰టుంజెందు సోపానముల్
జెలువారంగనుచుట్టియున్న తటముల్॰ జేరి శ్రమన్ శాలలన్
నిలగట్టించిరి చక్కగానడవిలో॰నేవంకలన్ జూడగన్॥ 104

తే॥ గీ॥ ఇట్టిసమయమునందున॰నీశుకృతము
వలన వచ్చె నాయడవికి॰వైభవముగ
కాశిపట్టణరాజు స॰కాల్బలముగ
కొడుకు కోడలి కూతును॰కూడితాను॥ 105

తే॥ గీ॥ వారువీరును వేటాడ • వచ్చిరపుడు
కాననమునకు మిక్కిలి • కఠినముగను
మృగములనుజంపు బంటులు • మేటివేట
లాడు కుక్కలు శరముల • యట్లుదోప॥ 106

వ॥ పాటలీపురప్రభువగు గురుదేవమహారాజుకుమారుడు
శ్రీసునందనుడను పేరుగలవాడు అడవియందొకప్రక్క
ను వేటాడుచుండెను. ఆయడవియందే కాశీదేశపు రా
జగు శివనందనుడు మరియొకప్రక్కను స్త్రీలసహా
యొకరిసంగతి మరియొకరికి తెలియకుండా వేటాడుచుం
డి రెట్లనిన॥ 107

తే॥ గీ॥ సింహశరభశార్దూలముల్ • చెంతరాగ
వింతజంపిరి బంటులు • పంతమునను
అంగబలములచేవారు • హరిణములను
వధయొనర్చిరి యన్నిటి • వరుసగాను॥ 108

తే॥ గీ॥ గండభేరుండపక్షుల • గడిమిద్రుంచి
అండజంబులకొన్నిటి • హతముజేసి
భండనంబున పగవారి • ప్రాణములను
దూల్చువిధమున మృగముల • ద్రుంచిరపుడు॥ 109

క॥ అంతట వర్షంబపుడ
త్యంతముగురియంగ నడవి • యతిభీకరమై
వింతగ చీకటిగ్రమ్మె ది
గంతములన్ నింగిభూమి • గనుపడకుండన్॥ 110

సీ॥ వాయువుచేతను • వారిహాయంబులు
యొకరీతిపోక • వెన్కకునుమరల
బాటలుతప్పించి • పలుతెరంగులబోవ
తోడివారందరు • తొలగిరవుడు
బాయనిబంటులు • బంధువులెల్లను
కాయములందాశ • కడకువదలి
బోయిరిభీతిచే • బారలుచునావేళ
బంధుదర్శనమును • బడయకుండ

తే॥ గీ॥ కాశిపురరాజపుత్రిక • కడకు తనదు
దాసివెంటను రాగను • తడబడుచును
పాటలీపురభూపతి • వరసుతుండు
వానిబంటునుజేరిరి • వటముక్రింద॥ 111

తే॥ గీ॥ వీరుమాత్రమెయొకచోట • విధివశమున
చేరిరావేళమిక్కలి • చిత్రముగను
పారిరంతట తక్కినవారు • మిగుల
దూరమునకు నడవిలోన • దుఃఖపడుచు॥ 112

వ॥ అప్పుడు రాకుమార్తె యేమనుచున్నదనిన॥ 113

క॥ యుక్తాయుక్తముదెలిసిన
భక్తినిగలబంట్లు లేరు • బరగునజూడన్
శక్తులు లేవిక మాకను
రక్తిగ మదినెంచిబోవు • రఘుకులతిలకా॥ 114

తే॥ గీ॥ అమ్మయయ్యలు యేమైరొ•యయ్య నేడు
అన్న వదినెలు యిద్దఱు•తిన్నగాను
జాడజూడంగ గనుపడ•రేడనున్న
వారొ దెల్పవె యిక మాకు•వారిజాక్షి॥ 115

తే॥ గీ॥ విరివిగలిగిన చలిగాలి•విసరివీచు
చున్నదయ్యొ యీ వేళ•నత్యున్నతముగ
గాన యనలముగలిగిన•మేనునిలచి
యుండు లేకున్న బ్రతుకిక•నుండదకట॥ 116

వ॥ అని యీవిధంబున రాకుమార్తె ప్రార్థించుచు దుః
ఖించుచున్న సమయంబున॥ 117

క॥ సీతలమెచ్చగ రాసుతు
డాతురతను నగ్ని జే•సెనమరగనృపుడున్
చాతుర్యంబగు వస్తువు
చేతను తాంబూనిమిగుల•శీఘ్రముగ నటన్॥ 118

క॥ ఆవెలుగున తాగనియెను
నావలనున్నట్టి రాజు•సతి మెలకువతో
భావమున బెదిరి రాసుత;
ఆవేళను రాసుతుండు•యతివనుజూచెన్॥ 119

తే॥ గీ॥ అగ్నిగోరినవారికి•నంత మన్మ
థాగ్నిగలిగెను మనములు•దడబడంగ
నొకరినొకరునుజూడంగ•నుగగళయును
సుతుని బాణంబుచేతను•సులభముగను॥ 120

క॥ శశిముఖి యాంతట ఘనపర
వశయై చాటునకుబోయె♦వడిసిగ్గున తా
కుశలముగనుండుకొరకా
నిశయందున రాసుతుండు♦నెచ్చెలి బాల్యన్॥ 121

తే॥ గీ॥ వారిబానిస లమరగా♦వారివారి
పనులు జేయుచు నారేయి♦భక్తి మీరి
యున్న సమయంబునందున♦నొకరినొకరు
నడిగి దెలిసిరి స్థితినంత♦నతిరయమున॥ 122

క॥ తమబంటులు తమంశోదుత
సమయముగని దెలిపిరన్ని♦సరసతమీరన్
భ్రమచేత శాచబిడ్డలు
తమమనములు రగులజొచ్చ♦తడబడిరంతన్॥ 123

తే॥ గీ॥ దైవమీభంగి జేసెను♦దయను నేడు
నటులగాకున్న సీచేరి♦కెటులగలిగె
కష్టములుదీర్చుభారము♦కడకు నెపుడు
తనది యైయుండునన్న♦తత్వము నెరింగి॥ 124

వ॥ అని రాకొమరుండు రాసుతయు దలచుచుండ నెవరి
సేవకులు వారికి వేరువేరుగా చెట్టుచాటున ప్రక్కలు
వేయ వారు పరుండియున్న సమయంబున॥ 125

తే॥ గీ॥ అటులనిటులనుదొర్లుచు♦వటముక్రింద
నుండిరంతట-మిక్కిలి♦నిండువలపు
దప్పకను వారిద్దరి♦దట్టముగను
ఘోరుని బాధలుబొందించె♦ఘోరిముసంత॥ 126

తే॥ గీ॥ నిదుర లేకను వారి కా॰నిశయుమిగుల
నిడుపుబారెను జూడంగ॰ నెనరుదప్పి
యదురుచుండెను హృదయ॰మత్యంతముగను
సందియముచేత మనము॰సంచలనమంద॥ 127

క॥ సొక్కను సుందరియప్పుడు
మక్కువలనుమరచి తాను॰మరినిదురించెన్
చక్కని రాచకుమారుడు
నిక్కము మరుబాధచేత॰నిదురనుమరచెన్॥ 128

క॥ అందరు నిద్దురపోవగ
సందడి జేయకను రాజు॰సఖియను జేరెన్
సౌందర్యముగనగోరుచు
కందర్పుని బాధచేత॰గడువడకుచునున్॥ 129

వ॥ అంత రాచకుమారీ యొక్క సొగసెట్టున్న దనిన॥ 130

సీ॥ సఖమోముచక్కని॰చంద్రబింబముబోలు
ముద్దుకన్నులుపద్మ॰ములనుబోలు
తీరగునాసిక॰తిలపుష్పమునుబోలు
గళము సొగసగుశం॰ఖమునుబోలు
జలజాక్షికుచములు॰జక్కవలనుబోలు
లలనచేతులు కమ॰లములబోలు
రాచబిడ్డతొడలు॰రంభాయుగముబోలు
మధ్యంబు మృగరాజ॰మధ్యమేలు

తే॥ గీ॥ మేనునంతయుజూడంగ॰మెరుపుతీగ
బోలియున్నది పూబోడి॰పూర్ణముగను
వచ్చుటకెగాని పోబుద్ధి॰హెచ్చులేక
రాచకొమరుడునిలచెను॰తోచకపుడు॥ 131

ఆ॥ వె॥ పంకజాక్షి ప్రక్క॰బరగ జేరకనున్న
బ్రతుకజాల నేను॰ప్రాణములతో
వంకరపనియిట్లు॰వలపుతో జేసిన
స్వామి కేమి జెప్ప॰వలయు నింక॥ 132

ఆ॥ వె॥ కనుక పరిణయమున॰కలకంఠినేగాని
పరమసంతసమును॰బడయవలయు
పడతియొప్పకున్న॰బైరాగినై నేను
ప్రాణములను నడవి॰పాలుజేతు॥ 133

క॥ అని తనమనసున గట్టిగ
దినకరవంశజుడు మిగుల॰ధీమతియుతుడై
ఘనమగు యోజన జేయను
తన పాన్పునకరిగెనపుడు॰ధైర్యముతోడన్॥ 134

క॥ రాచకొమరుండు తననిటు
యోచనతో జూచినట్టి॰యూహాలు లేకే
లేచెను సూర్యోదయమున
నా చెలి తనవిరహామెల్ల॰నడచుచుమిగులన్॥ 135

వ॥ అట్లు రాచకుమారేంద్ర లేచి, తనదాసినిబిలచి యీరో
జున మనకు భోజనపువసతి యేమియని విచారించుచుం

డగా రాకొమరునియొక్క బంటువచ్చి దూరముగా రెండుబండ్లు యెద్దులుసహా కనుపించుచున్నవి అవి యే మో చూచివత్తము రమ్ము అని దాసినితీసుకొనిపోయి చూడగా, 136

ఆ॥ వె॥ దైవకరుణవలన॰దాసితానదుఫంగ
దరికి జేరె రెండు॰సరుకుబండ్లు
పూనిజూడ నందు॰భోజనవస్తువుల్
పాత్రలుండె మిగుల॰చిత్రముగను॥ 137

వ॥ అంతట బండ్లు తమకుగాను తీసుకొనిరాబడిన సామా గ్రిబండ్లుగా తెలిసికొని వానిని దాపుకు తోలుకొనిపో యి కావలసినసామాగ్రులు తీసుకొనిరి॥ 138

తే॥ గీ॥ వటముక్రింద నావేళను॰వంట జేసె
షడ్రసంబులతోడుత॰జక్కగాను
భోజనంబైనపిమ్మట॰రాజసుతుడు
వరునిగాజూడ సఖయకు॰వార్తబంపె॥ 139

క॥ వెదకన్ బోయెడునోషధ
ముదమొప్పగ వేళ్ళలోన॰మొనసినరీతిన్
సదయునివార్తకునొప్పియు
మదవతి మానమునుదాల్చె॰మానినియగుటన్॥ 140

వ॥ ఇట్లు రాజకొమరుడు బంపినవార్తను విని మనమున నుప్పొంగినదై, మానినియగుటవలన గొంత సిగ్గుచేత

గొంతగంభీరముచేత ప్రథమములో నొప్పునట్లు నటించి తుదకావర్తమానము తన కిష్టమయినట్టు గ్రహింప జేసెను. 141

శ్లో॥ ఔదుంబరాణిపుష్పాణి శ్వేతవర్ణంచవాయసం
మత్స్యపాదంజలేపశ్యేత్ ననారీహృదయస్థితం॥

వ॥ అని నీతిశాస్త్రములో జెప్పబడినట్లు రాచకొమార్తె తనహృదయమును ముందుగా దెలియపరచక రాకొమరుని మనమును తెలిసికొని పిమ్మట దా నంగీకరించినట్లు గ్రహింపజేసెనేగాని స్పష్టముగా దెలిపినది గాదయ్యె. అయినను రాకుమారుడు తాను నెలవుజేరిన తరువాత తన తండ్రితో జెప్పి ఆచిన్నదాని తండ్రివద్దకు రాయబారముపంపెదనని బాసజేసి తిరిగి ఆచిన్నదానికి వర్తమానము బంపెను. ఇకను వేటకువచ్చిన తక్కినవారిసంగతి యేమనగా. 142

క॥ తమవారంతట నెట్టులొ
తమతమ నెలవులను జేర• దైన్యముతోడన్
దమపురము జేరుతరికిని
దమకొక నెలబట్టె నడవి• దైవవశమునన్॥ 143

క॥ పాటలిరాజ్యముగైకొన
పాటించుచు వేచియుండి• పర రాజొకడా
మేటిపురంబునుబట్టెను
వాటముగని పెట్టి మిగుల•బలములతోడన్॥ 144

క॥ పరరాజంతట పాటలి
పరిపాలన జేయనుంచి ప్రాజ్ఞుని యొకనిన్
గురుదేవు నతని భార్యను
మరలించుక పోయెనకట మానినివగువన్॥ 145

వ॥ ఇట్లు పట్టుకొనిపోబడి రాజ్యసంబంధమయిన ఖయిదీలుగా కోటలయందు నుంచబడిరి. అప్పుడు గురుదేవుడిట్లని యీశ్వరుని ప్రార్థించెను. 146

సీ॥ అయ్యయో యీవిధి చయ్యన నేనెట్లు
గడుపుదునిక మీద కమలనాభ
అనఘ నాపైనింత యాగ్రహంబది యేల
బ్రోవకుంటివినన్ను భుజగశయన
ప్రాణతుల్యంబైన పతిసతులం బాప
బాడియయ్యానీకు పరమపురుష
రాముడవై నీవు రమణిగోల్పోయిన
వెతలెల్ల మరచితే విమలమూర్తి

తే॥ గీ॥ దివసమొక్కొక్క యేడుగా దేలుచున్న
దయ్య మాకును యీవేళ నమరవినుత
సంశయంబులుమాని మా సంకటముల
తక్షణముదీర్చి బ్రోవుము పక్షిగమన॥ 147

వ॥ అని యీవిధమున ప్రలాపించి తుదకు. 148

శ్లో॥ హరిణాపి హరేణాపి బ్రహ్మణాపి సురైరపి
లలాటలిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే॥ 149

వ॥ అని పెద్దలుచెప్పినచొప్పున నెవరికిని వానికర్మనుబట్టి వ్రాసిన లలాటలిఖితము తప్పించుకొన శక్యముకాదని చెప్పి యాకోటలో వంటరిగానుండెను. ఆయనభార్యను కూడ యింకొకకోటయందుంచిరి. ఇకను వీరికుమారుడు యరణ్యంబున రాచకొమార్తెకు పెండ్లిగాయ భారము పంపెదనని బాస జేసి వర్తమానము జేసిన తరువాత జరిగినసంగతి యేమనగా.

తే॥ గీ॥ శ్రీసునందనుడప్పుడు॰ క్షేమముగను
జేరె తనపట్టణముపోయి॰ జెందగోరి,
చెడ్డపగవారు వానికి॰ చెరవిధించి
తీసుకొనిపోయిరక్కట॰ తీవ్రముగను॥ 150

వ॥ అయ్యయొ! యెంతకష్టమువచ్చినది. సప్తవ్యసనముల లో నొకటయిన వేటకూడదని చదివియు దాని నిరాకరించినందుకు యీయవస్థ తటస్థమయినదని పాఠము తెలిసికొనినవాడై యిక జన్మాంతమువరకు వేటాడనని నిశ్చయముచేసికొని కారాగృహమున వంటరిగనుండెను. యికను రాచకొమార్తెసంగతియేమనగా.

క॥ ఎన్ని దినంబులుజూచిన
మన్ననతో రాజసుతుడు॰ మానినిపితకున్
తిన్నంగవార్తనంపమి
కన్నీటినిగార్చె కలికి॰ కడుదుఃఖముతోన్॥ 152

ఆ॥ వె॥ ప్రాణనాథుడకట! పరిణయమునుగోరి
పంపడయ్యె వార్త ప్రభువుకడకు
హానియేమిదైన నతనికిగల్గెనో
హా! యటంచు నేల నతివ వ్రాలె॥ 153

సీ॥ రాసుతుండంపిన రమణీయమగునట్టి
మాటలువర్ణించు మగువ యెపుడు
సాటివారలగూడి మాటలాడకనుండు
బోటులతో నాట పాటలెడలి
విరిబోడులనుగూడి విహరించదెప్పుడం
దంబైననిద్దంపు నగవుతోడ
హంసతూలికతల్ప మమర వేయగ నొల్ల
కతివ యలిగియుండు ననుదినంబు

తే॥ గీ॥ రాచకొమరునియందాత్మ రమణినిలిపి
యోచనంబులు జేయుచు నూరకుండు
జూచువారికి నిదియొంతొ చోద్యముగను
గానుపించగ కాలము గడుపుచుండె॥ 154

క॥ అన్నము తిన్నగదినకను
సన్నని వలువలనుగట్ట సఖివిముఖియగున్
మన్నన జేయదు చెలులన్
వెన్నునిసుతుశరము చేత విరహము సోకన్॥ 155

వ॥ ఈప్రకారము రాకుమార్తె యైన గౌరీదేవి సమస్తము
విసర్జించియుండగా. 156

ఆ॥ వె॥ విషమజాడ్యమంచు•విప్రులుజెప్పంగ
వడిగబిలువనంపె•వైద్యవరుల
వరుసగమణిమంత్ర•పరమౌషధంబుల
వాడిరంతవారు•వనితకొరకు॥ 157

తే॥ గీ॥ ఎంత జేసినకష్టము•కాంతకపుడు
దప్పదయ్యెను మిక్కిలి•దండిపనులు
సలిపిననుగాని వారెల్ల•సఖినిగూర్చి
యేలెరుంగక వాతను•వేయుకరణి॥ 158

శా॥ ఈనారీమణిగోరినట్టిపతి తా•నెన్నాళ్ళకున్ రామిచే
మానప్రాణములుగ్గబెట్టి మిగులన్•మైకంబులన్ జెందుచున్
దీనాలాపములాడుచుంటగలిగెన్•తేజంబుహీనంబుగా
గానేవ్యాధియు లేదురాసుతకుయా•కామంబెజాడ్యంబగున్॥

వ॥ ఈబిడ్డకు నట్లు గలుగుటకు నవకాశము అడవియందు వంటరిగానుండుకాలముదప్ప మరియొకటిలేదు. గనుక అప్పుడు వెంటనున్నదాసిని విచారించవలెనని మంత్రి యూహించి 159

క॥ వనితనువిడువని చెలియం
బనిక త్తెను బిలువనంపె•మంత్రివరుడు, దా
వినుపించె చెలియ బాసిన,
కనినది విన్నదియునెల్ల•గడుస్పష్టముగన్॥ 160

వ॥ దాసిచెప్పిన వృత్తాంతమంతయు సవిస్తారముగా విని తానూహించినట్లే జరిగినదిగదాయని తెలిసికొని యీ

వార్తరాజునకు జెప్పనిశ్చయించెను ఇకను చెరయందు
న్నరా కొమరుని వృత్తాంతమేమనగా. 161

ఆ॥ వె॥ చెరను వేయుటకును • చిక్కినవారల
కోటలోననుంచి • సాటివారి
తోటిమాటలాడ • వాటములేక క
వాటములను మిగుల • గట్టిజేసె॥ 162

వ॥ ఇట్లు రాజు చేయగా, రాకొమరు డిట్లని యీశ్వరుని
ప్రార్థించెను.

క॥ హెచ్చినభక్తి నివేడెను
వచ్చినగష్టములకు కరి • వరదుని మిగులన్
విచ్చలవిడిగ నుదిరుగమి
జచ్చినబ్రతుకనియె నతడు • జగతినిమిగులన్॥ 163

సీ॥ కావవేమిరకృష్ణ • కాని కార్యములనే
నేమి జేసితినయ్య • యిలనుమిగుల
పరిణయంబునుగోరు • పడతినిబంధుల
మురిపంపుప్రాసాద • ములనువిడువ
దివసమావారమా • దీర్ఘమైన నెలలా
విరివిగ గడిపి నే • వెళ్లుటకును
కలకాలమీ చెర • గడుపు టసాధ్యము
కమలనాభ నీదు • కరుణలేక

తే॥ గీ॥ గానబ్రోవుము యీవేళ • గానలోల
తాళజాలను యిక నేను • దైవరాయ
నీవుగాకున్న నాకిక • లావువారు
లేరు భువిలోన జలజాక్ష • వేరెజూడ॥ 164

వ॥ అని రాకుమారు డీప్రకారము ప్రార్థించుచుండె. అంత
నంతఃపురవిశేషంబు లేమనిన. 165

తే॥ గీ॥ రాచపుత్రికరుగ్మత • రాజు కెరుక
జెప్పినప్పుడు వరమంత్రి • యొప్పుగాను
యోచనలు చేసి రారాజు • రాజసుతుని
బంట్లచేతను బిలుపింప • పరమకృపను॥ 166

వ॥ రాజాజ్ఞప్రకారము బంట్లుపోయిచూడగా రాకొమరు
డు యీవిధముగా భగవత్ప్రార్థన జేయుచున్నాడు. 167

ఆ॥ వె॥ ఎట్టిపనులుమాట • లెట్టితలంపులు
యిలను జేసినాను • ఇనకు లేశ
యిట్టికష్టంబుల • నిప్పుడునాపాలు
జేసినావు నాకు • శిక్షగాను॥ 168

ఆ॥ వె॥ బుద్ధివచ్చెనయ్య • పుడమిని జాగరూ
కతనుగలిగి నేను • సతతమునను
హితము జేతుకరుణ • నెల్లవారికి నిల
పరమపురుష నామం • బ్రతుకునిలుపు॥ 169

వ॥ ఇట్లు ప్రార్థన జేసి యూరక కూర్చున్న సమయమున॥

క॥ బంటులుబోయిరియంతట
వెంటనె రాసుతుని దేగ• వేడుక మీరన్
కంటనునీరును బెట్టిన
వంటరిగానున్న వాని• బంటులుబండన్ ॥ 171

తే॥ గీ॥ అయ్యారావయ్య యీవేళ•నమరగాను
మిమ్ము దెమ్మనెనిప్పుడు• మేదినీశు
డనుచుబలికిన బంటులు•వినుచుతాను
బయలు వెడలెను మిక్కిలి•భయముతోడ॥ 172

వ॥ బంట్లు చెప్పినమాటలువిని రాసుతుడు యిదియేమి య
పాయమోయని కొంతభయముతోను విముక్తి య
య్యెనేమోయని కొంతనాశతోను బయలు వెడలుచు
భగవంతు నిట్లు వేడుకొనెను. 173

మత్తకోకిల.

రామచంద్రుని పాదపద్మము• రాజసంబున వేడితిన్
ఈమహింగలవానికీర్తుల• నెప్పుడున్ గొనియాడితిన్
ప్రేమతోడుతనాదుమానస• భీతిబోవభజించితిన్
వామదేవుని ప్రేమచేతను• వాంఛదీరెను నేటికిన్॥ 174

ఉ॥ క్షేమముగల్గినట్టి శివ• సేవలుమిక్కిలిసల్పునట్టి యా
ధీమతుడైన కాశిపుర•దీప్తుని జేరెను శ్రీసునందుడే
క్షేమముగల్గునోయనుచు• చెంతకువచ్చెను రాజు జాలిచే
పామరబుద్ధినైతి నిను• బాధలు బెట్టిన కారణంబునన్
వేమరుతప్పు లెంచకను• ప్రేమనుజూపుడు నాయెడన్ గదున్॥

క॥ అనుచును గాఢాలింగన
ము నుజేసిన రాజుమాట • మోసమోయని తా
వినుచున్భ్రాంతినిబొందుచు
చనెదూరము రాజసుతుడు • చయ్యనవపుడున్। 176

తే॥ గీ॥ భయమువలను నాపుత్రికి • వరునిగాను
జేయుదునుగాన నిన్ను నీ • చింతనొలగ
మరువవలయును పగలెల్ల మంచికొరకు
ననుచుబలికెనుభూపతి • హర్షమెసగ॥ 177

వ॥ అనిన విని రాకొమరుడు దీనికినొప్పకున్న నేమిజేయు
నోయని భయభ్రాంతుడై తిరిగి ధైర్యముదెచ్చుకొని
ప్రభువుతో నిట్లనియె. 178

క॥ అనవిని రాజకుమారుం
డనుమానము లెల్లవీడి • యనియె నతనితో
ననుకూలమిచట కాదిక
వనితనునే వేరుచోట • వలచితిగనుకన్॥ 179

తే॥ గీ॥ ఎక్కడున్న దినీసతి • నిక్కముగను
జెప్పుమంచును భూపతి • చెలిమిననుగ,
కాశిరాజున కొక్కతే • కన్నబిడ్డ
రమ్యముగ తనసతియనె • రాసుతుండు॥ 180

వ॥ ఇంతవరకు తమను చెరసాలలో నుంచినది కాశీరాజని
శ్రీసునందునకు దెలియనికారణమున పైవిధమున జె
ప్పెను. 181

తే॥ గీ॥ కాశిరాజును నేననిఁ కరముబట్టి
జెప్పె శ్రీసునందనునకుఁ జెలువుమీర
నామసుత గౌరి నీమీదఁ న్యాయమైన
ప్రేమదెల్పుచునున్నదిఁ ప్రియుడవగుము॥ 182

తే॥ గీ॥ అనుచుజెప్పిన శివనందుఁనమృతవాక్కు
వినుచు బరవశుడగుచునుఁ మనమునందు
ఆశ సానుకూలమిటులఁ కేశవునికృ
పను గలిగెనంచు వానినిఁ భక్తి వేడె॥ 183

వ॥ అప్పుడు రాకుమారుడే ప్రకారముగా భజనచేయుచు
న్నాడనిన॥ 184

సీ॥ నాతరమా వేడఁ నళినదళేక్షణ
నీమాయదెలియంగఁ నేరనయ్య
వేటకొఱకుబోయిఁ బోటినిజూడంగ
భ్రమనుగల్పించినాఁ బ్రతుకుకొంత
చెరసాలలోననుఁ జేరంగ జేసియు
పురముపరులపాలుఁ నరయ జేసి
వరములొసగినట్లుఁ పగవారివరసుతన్
నాసతిగా జేసిఁ నాథనాదు

తే॥ గీ॥ వాంఛదీర్పంగదలచినఁ వాడవౌర
కన్నతండ్రిగ యీరీతిఁ కడకునాకు
గలుగ జేసినసామి యోఁ గరుడగమన
యెన్నివిధముల నిన్ను నేఁ సన్నుతింతు॥ 185

వ॥ భగవంతుడు చిత్రమయిన మార్గమున తనకు మేలు జేసి నదానికి వానిని ప్రార్థించినతరువాత. 186

తే॥ గీ॥ అక్కబావల నల్లుని•యొక్క వైన
సాధములయందునుంచెను•సౌఖ్యమలర
ఇలనుగలవాని నన్నిటి•నిచ్చి మిగుల
గౌరవించెనువారిని•గౌరితండ్రి॥ 187

వ॥ వారినందరిని విడిదినందుంచి వారికి షడ్రసోపేతముగా విందులు గావించుచుండెను. ఇక రాకుమారిత్తెసంగ తి యేమనగా॥ 188

తే॥ గీ॥ స్వాతివానకు నెప్పుడు•సాగరమున
మౌక్తికపుచిప్ప వేచెడు•మార్గమువలె
సామిరాకకు సతతము•జూడగనుచు
కాచుకొనియుండె నింటను•రాచబిడ్డ 189

వ॥ మరియు నొకనాడు విరహముబట్టలేక తనదాసినిబిలచి గౌరి యిట్లనియె. 190

క॥ దాసినిబిలచిట్లనియెను
వాసిగ గౌరియొకనాడు•వర రాసుతునే
బాసిక తాళగజాలనె
యోసతి వానినిటదేవె•యుసురులునిలువన్॥ 191

వ॥ ఈమాటలు దాసివిని రాకుమారిత్తెవిభు డెచ్చట నున్నాడో తెలియనిదాటవలన యేమిజేయునది దోచక నిలువబడియున్న సమయంబున॥ 192

తే॥ గీ॥ గారిజనకుడు తనసుత • గతిని దెలసి
వచ్చి యొకనాడు యామెతో • ముచ్చటించె
నడవిజరిగినదంతయు • విడిగ నేను
దెలుసుకొని నీదువరునిటు • దెచ్చియుంటి॥ 193

వ॥ అమ్మా! నీవుకోరినవానిని పిలిపించి సిద్ధముగానుంచినా
ను గనుక సుఖముగా నుంగుమని రాజు తనపుత్రికతో
జెప్పి వెళ్లెను॥ 194

క॥ అంతట రాసుత యొకనా
డంతస్తులపైననున్న • యతిసుందరుడా
కాంతునిజూచెను, తాబహు
వింతగుమార్పులను గలిగి • విహారించునడన్॥ 195

వ॥ అంతట రాకుమార్తె తన దాసినిబిలచి యోసీ! మన
కరణ్యంబున సమావేశమైన రాకుమారుడు యితడేగ
దా యని యడిగి తాను కొన్నిదినములక్రిందట జూచి
మోహించిన బ్రాహ్మణులు తెచ్చిన పటములోనిగల
రాచకొమరుండు యితడేనని నిశ్చయించెను.

అనగా యరణ్యంబున, షికారీదుస్తులతోనున్నను
యతని రూపురేఖలనుజూచి గ్రహించినదాటవలననే
తాను మోహామును పొందినది. ఇది, పతివ్రతలకు మొ
దట తమమనస్సు యెక్కడలగ్నమైనదో అక్కడనేగా
ని తదితరులను జూచి మనస్సు చలించదనుసంగతి ని
స్పష్టపర్చుచున్నది. ఇప్పుడు, అరణ్యంబుననున్న షి

# ఉపన్యాసము.

## విషయము:—"నిజసుఖసాధనము"

సోదరులారా!

బౌద్ధ, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైతమతములు నాలుగును యీక్రిందవ్రాయబడిన ధర్మములను బోధించుచున్నవి. అవి యేవియనగా:—

1 అహింసా పరమోధర్మః

2 ఆత్మవత్ సర్వభూతాని

3 పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం

4 కర్మము సుఖదుఃఖములకు కారణము.

I 'అహింసాపరమోధర్మః' అని చెప్పినదానివలన యేప్రాణికిని హింసగలుగజేయరాదు. హింసజేయుటయనగా చంపుటయని యర్థము. అయితే పరులకు నష్టముకలుగు అకృత్యములుజేసి వారి మనస్సుల నొప్పించుటకూడ 'హింస'లో చేరినదే. కాబట్టి యెట్టిహింసనుకూడ చేయకూడదని తాత్పర్యము.

II 'ఆత్మవత్ సర్వభూతాని' యని చెప్పినదానివలన ప్రపంచములోజనులు నడుచుకొనవలసిన విధమెట్టిదనగా:-తనను గురించి యెంతశ్రద్ధాభక్తులతో తాను నటించునో అంతశ్రద్ధాభక్తులతో సర్వభూతములనుగురించి, ముఖ్యముగా మనుష్యులనుగురించి, నటించవలయును. అనగా తనకుతాను సర్వదా సుఖదాయకములైన కృత్యములను చేసికొనునుగదా.

ఆవిధముగనే సర్వ నర, మృగ, పశు, పక్ష్యాదిప్రాణులను గురించికూడా వారికి సుఖదాయకములయిన కృత్యములనే చేయవలయునుగాని కష్టదాయకములయిన కృత్యములను చేయకూడదని తాత్పర్యము. "సకలప్రాణులయందును దయను గనుపరచుట"ను గురించి పెద్దలిట్లు చెప్పియున్నారు.

మ॥ పరహింసాపరకీయవిత్తహరణాభావంబు సత్యవ్రతా
దరముం దానపరత్వమన్యవనితో దంతోక్తి మూకత్వముం
బరతృష్ణాఝరభంజనంబు గురునమ్రత్వంబునుం బ్రాణభృ
త్కరుణాశాస్త్రసమత్వసద్విధులు భద్రప్రాప్తికిన్ మార్గముల్ ॥

భ॥ హ॥

తా॥ జీవహింసనువిడచి పరులద్రవ్యమునందు మనసుబోనీక సత్యముపలుకుచు దేశకాలములెరిగి శక్తికొలది దానముచేయుచు బరస్త్రీలవిషయమునుగురించి ఏమియుబలుకక మౌనముదహించి ఆశ్యాశనునిలిపి గురువులయందు వినయమును గనంబరచుచు "సకలప్రాణులయందు దయం గనబరచుట" శ్రేయమును కలుగజేయునని సకలశాస్త్రములందును సుప్రసిద్ధముగా నున్నది.

III "పరోపకారఃపుణ్యాయ పాపాయపరపీడనం" యనిచెప్పినట్లొప్పిన పుణ్యము, పాపము అను లోకమునందు రెండుకర్మలుగలవు. పుణ్యమనగా, పరులకు ఉపకారముచేయుట. పాపమనగా, పరులకు పీడను అనగా బాధను కలుగజేయుట యయ్యున్నది. కర్మసిద్ధాంతప్రకారము పుణ్యము చేసినవానికి ఇహపరలోకసుఖములును, పాపము జేసినవానికి ఇహలోకమునొక్కయు నరకలోకమునొక్కయు దుఃఖములు కలుగును. కాబట్టి మనుజుడు సర్వదా పరులకు ఉపకారము చేయ

వలయును. అథవా ఉపకారముచేయలేకపోయినా అపకారము యొంతమాత్రము జేయకూడదని తాత్పర్యము.

IV "కర్మము సుఖదుఃఖములకు కారణము" అని చెప్పిన చెప్పిన మనుజుడు మూడువిధములుగా కర్మను చేయుచున్నాడు, అవి:-

(a) మనస్సుచేతనున్ను,

(b) వాక్కుచేతనున్ను,

(c) చేతులు మొదలగు అంగములచేతనున్ను చేయుచున్నాడు.

(a) మనస్సుచేత చేయుకర్మ.

(1) ఇతరులనుగురించి వారికి మేలుగలుగవలెనని తలంచుట సత్కర్మ.

(2) ఇతరులనుగురించి వారికి కీడుగలుగవలెనని తలంచుట దుష్కర్మ.

(b) వాక్కుచేతచేయుకర్మ.

(1) ఇతరులను గురించి వారికి మేలుకలుగు మాటలను చెప్పుట సత్కర్మ.

(2) ఇతరులను గురించి వారికి కీడు కలుగు మాటలను చెప్పుట దుష్కర్మ.

(c) చేతులు మొదలగు అంగములచేతచేయు కర్మ.

(1) ఇతరులనుగురించి ధర్మము, ఉపచారము మొదలగు కృత్యములు చేయుట సత్కర్మ.

(2) ఇతరులనుగురించి దొంగతనము, కొట్టుట, చంపుట మొదలగు కృత్యములు చేయుట దుష్కర్మ.

ప్రతిమనుజుడును తాను పైనచెప్పబడిన మనోవాక్కాయములతో జేయుకర్మయొక్క ఫలమును యీజన్మయందుగాని మరియొక జన్మయందుగాని తప్పక అనుభవించితీరును. చందనమును స్పృశించిన శీతలమును నిప్పునుపట్టినవారికి ఉష్ణమును యెట్లు సుఖదుఃఖములను గలుగజేయునో ఆలాగుననే సత్కర్మ జేసినవారికి సుఖమును దుష్కర్మజేసినవారికి దుఃఖమును తప్పకగలుగును. స్వాభావిక ధర్మములు (Natural Laws) యెంతసత్యమో కర్మ ధర్మము (Law of Karma) కూడ నంతసత్యమని నమ్మవలసినది. దీనికి దృష్టాంతము మనకు వేరే యవసరములేదు. మనమిప్పు డనుభవించుచున్న సుఖదుఃఖములే మనకు సాక్షి. నీనామరూపములెట్లుండి నివు కర్మజేసిననూ "నేను" అని చేయుచున్నావు. ఆకర్మఫలమును తిరిగి నినామరూపము లట్లుండినను యుండకపోయినను "నేను" అని అనుభవించుచున్నావు.

2. మనుజుడు కర్మననుభవించుట వానికి శిక్షయని జెప్పుదురు గదా " నేనట్టికర్మజేసినందున నాకిట్టి దుఃఖముకలిగెనని " నాకు యెరుకలేకుండా భగవంతుడు చెయ్యడు. ఇట్లు యెరుక లేకపోవుటయే పూర్వజన్మములేదనియు అప్పటి కర్మఫ

లానుభవము యీజన్మయందు కలుగుట యబద్ధమనియు గొందరు చెప్పుదురేమో?

3. దీనికి సమాధానమేమనగా, భగవంతుడు సృష్టిని జేయుట యందాయనకుగల యేర్పాట్లకు భంగములేకుండ గలందులకు ధర్మమును (Law) నిర్మించినాడు. భూతభవిష్యత్తులు మనుజునకుదెలియుట ఆ (Law) ధర్మమునకు భంగకరమగును. ఎట్లనిన, పూర్వజన్మవృత్తాంతమును, తానుజేసిన సుకృతదుష్కృత కర్మఫలములును, తనకుగోచరమై యున్నచో యీజన్మయందు తనకు యెట్టికష్టము లేక మరణము మొదలగునవి తటస్థించునో తెలియును. దీనినిబట్టి తనకు ఒకరెండుసంవత్సరములకు మరణము తటస్థించునని తెలిసినప్పుడు అదిమొదలు తాను యేపనియును చేయజాలడు. బ్రహ్మచర్యగృహస్థాది యాశ్రమకృత్యములను చాలించి దిగులుపడి కూర్చుండును. (" మరియు తనకుపూర్వజన్మయందు గలిగిన ఘోరము లేనైననున్న యెడల వానిని ఒప్పుకుభరించుట మిక్కిలికష్టము") గనుక యీజిజ్ఞాసతో కలవరపడుచుండును. ఇది ప్రపంచనటనకు భంగమగును. కాబట్టి తానుపూర్వజన్మయందు అట్టికర్మజేసినందుకు యిట్టిసుఖదుఃఖములుకలిగెనని తెలియుట యవసరము లేదనియు మీాది మిక్కిలితెలియగూడదనియు, భగవంతుడు మనకు అజ్ఞానమివ్వలేదు. అట్లు తెలియకపోయినను " నేను " అనుభవించుచున్నాను అని నీవుయనుభవించుచే నీకుసాక్షిగా తెలిసికొని సత్కర్మను ఆచరించి దుష్కర్మను త్యజించవలెను.

చ॥ హృదయవచశ్శరీరముల ♦ నెంతయుఁ బుణ్యసుధాప్రపూర్ణులై
ముదము బహూపకారముల ♦ మూఁడు జగంబులకున్ ఘటించుచున్
వదలక సాధుసద్గుణుల ♦ వంబులు కొండలు సేసి మెచ్చుచున్
మదివికాసయుక్తులగు ♦ మాన్యులు గొందఱు వొల్తురిద్ధరన్ ॥ భ॥ హ॥

తా॥ మనోవాక్కాయములందును సత్కర్మలనొనర్చుటయను అమృతముచేత పూర్ణులయి ముల్లోకములందున్నవారికి ఉపకారమొనర్చుచున్నవారలయి పరులయందుండిన అణువులవంటి సద్గుణములయినను కొండంతగా భావించి వికసించుచున్న హృదయముగల సజ్జనులు కొందరు మాత్రమేయుందురు.

4. ఏమతప్రకారమయినను సత్కర్మానుష్ఠానము అనగా పుణ్యకర్మచేయుట ముఖ్యము గనుక దానిని తప్పక జేయవలెనని శాస్త్రవాక్యము (It is nonsense. It is all bosh.) అని చప్పరించుకొందురు (పరిహాసములు) పనికి రావు కర్మయను ఊడివదలునది కాదు. దానిఫలమును "నేను" అని అనుభవించేతీరవలెను. గనుక దానినియనుభవించుచు నేయున్నాము. కాబట్టి దీనినిమరువక, మరువక, మరువక నిగ్రహగలిగి అనగా జాగ్రతగలిగి దుష్కర్మానుష్ఠానము త్యజించవలెను. పెద్దలు ఒక్కొక్కనీతిని బోధించి ఆప్రకారము మనము నడుచుకొనుటకు ఒక్కొక్క వ్రతతంతు నేర్పాటుజేసిరి. పెద్దలవలె ప్రజలునడుచుకొనవలెనని జ్ఞాపకముచేయుకొరకు వారిజయంతుల నేర్పరచిరి. కర్మసంబాధములో చిత్రకపులు వ్రతతంతు నేర్పాటుజేసిరి. వ్రతములు డంబముగా జేసి ఆబోధింపబడిన నీతులను గమనించక యుండుట నిష్ప్రయోజనము. ఆవ్రతములు లేక జయంతు

లుచేయుటవలన సంగతులు స్ఫురణకు వచ్చుగాకయని యు ఆప్రకారము తప్పకమనము నడుచుకొనవలెననియు గ్రంథకర్తల యభిప్రాయము గనుక వారియభీష్టమును నెరవేర్చి వారికికృతజ్ఞులమై మనముకృతార్థులము కావలెను.

6. లోకములో ప్రతిమనుజుడును ఏయాశ్రమమునందుండి యెట్టికర్మను జేసినను సుఖమునకనే చేయుచున్నాడు. అట్టిసుఖములు రెండువిధములు. 1. పరలోకసుఖము. 2. ఇహలోకసుఖము. మొదటిసుఖము శాశ్వతమైన పారమార్థికసుఖమునుకోరి, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణధ్యానసమాధులనెడి అష్టాంగసిద్ధియు, జ్ఞానవైరాగ్యాది నియమములను, * నవవిధభక్తులను గలిగి అట్టి సుఖముకొరకు ప్రయత్నము చేయుటయొక్కటియుత్తమము ననంగతి వైరాగ్యమునుగురించి పెద్దలిట్లువ్రాసియున్నారు

శ్లో॥ భోగేరోగభయంకులేచ్యుతి భయంవిత్తేనృపాలాద్భయం మానే దైన్య
భయం బలేరిపుభయం రూపేజరాయాభయంశాస్త్రేవాదభయం గుణే
ఖలభయం కాయేకృతాన్తాద్భయం సర్వంవస్తుభయాన్వితం భువినృ
ణాం వైరాగ్యమేవాభయం ॥ భ॥ హ

తా॥ భోగములనుభవించెదమనిన రోగభయము సత్కులవంతులకు అప్రతిష్టభయము. ధనమున్న రాజులభయము మానవంతులకు దరిద్రభయము. బల

---

* ఈశ్వరోవాచ॥ 1. సత్సాంగత్యము. 2. మత్కథాలాపము. 3. మద్గుణేరతి: అనగా నాగుణములయందు ఆసక్తిగలిగియుండుట. 4. నావచనములకు వ్యాఖ్యచెప్పుట. 5. పుణ్యశీలత్వము. 6. నామంత్రోపాసనం సలుపుట. 7. యమాదినియమములు గలిగియుండుట. 8. వైరాగ్యము. 9. నాతత్త్వోపాసనచేయుట. ఇవినవవిధభక్తులై యున్నవి.

వంతులకు శత్రుభయము. రూపవంతులకు ముసలితనమువచ్చునని భయము. శాస్త్రజ్ఞులకు ప్రతివాదిభయము. గుణవంతులకు దుర్మార్గులవలన భయము. శరీరముఁ జూచుకొనునపుడు మరణభయము. యీభూమియందు సమస్తవిషయములునుభయముతోఁ గూడుకొనియున్నవే. వైరాగ్య మొక్కటియే నిర్భయమైనది.

7. రెండవపక్షము ప్రత్యక్షములోని ఐహికసుఖమును కోరుటయయ్యున్నది. ఈసుఖములు యేమనగా:— ఆయురారోగ్యవృద్ధి. ధనకనకవస్తువాహనవృద్ధి. ఈమొదలుగాగలవి. ఇవిగలిగిన మనుజుఁడు మిక్కిలి సుఖముగానుండునులాయితే వానికర్మవిశేషమువలన వానికిభంగముగలిగినప్పుడు ఆమనుజునకు వాటినుండిగలుగు సుఖమునకన్న దుఃఖము అనేకరెట్లుగానుండును. ఇట్లు ఐహికసుఖములు మిక్కిలి దుఃఖమిశ్రమములుగానున్నవి.

ఉ॥ కాయముగుంచిగర్భనర ♦ కంబుననుండుట దుఃఖమాదియం
దాయతలోచనావిరహ ♦ మబ్బుటదుఃఖము జబ్వనంబునం
బాయకభామి నీహాసన ♦ పాత్రముదుఃఖము వృద్ధభావమిం
కేయడఁగల్గు సౌఖ్యలవ ♦ మించుకయేఁ జనులారచెప్పుడీ ॥ భ॥ హ॥

తా॥ లోలుతమూత్రములలో నొడలుసంకోచించుకొని యల్లాడుచు గర్భనరకము నైపవలయును యౌవనమున ప్రియురాండ్రవియోగము నోర్వఁజాలక పొగులవలయు. ముసలితనమునఁ జంచలాక్షులు వెక్కిరించి నవ్విన నవమానముపాలుకావలయు. ఓనరులారా! ఈసంసారమున నించుకేనిసౌఖ్యముకలదేనిజెప్పుడు. అనగా లేదనితాత్పర్యము.

అయినను వానినికర్మానుసారేణా మనము అనుభవించకతప్పదు. గనుక వానిననుభవించుచునేయున్నాము. కాని ని

జముగా మనకు యీలోకమందు సుఖముకలుగజేయునది యేదియనివిచారించగా సర్వదా యితరులను *న్యాయముగా ప్రేమించుట (To love) యైయున్నది. ఇది దైవకార్యమని గట్టిగానమ్మవలెను దీని సలుపుటకంటె యెక్కువ సుఖము మరియొకదానివలన కలుగనేరదని యనుభవమువలన తెలియును గనుక ప్రతిమనుజుడును ఇతరులను ప్రేమించుటను అభ్యాసముచేసుకొననలయును. ఈయభ్యాసమునకు మీరు విశేషధనము వ్రయపెట్టనక్కరలేదు విశేషకష్టపడనవసరములేదు. విశేషవిద్యలు నేర్చవలసిన పనిలేదు. ఇష్టమున్నయెడల వ్రయప్రయాసలు లేకనే సులభముగ నబ్బును. ఇట్లితరులను ప్రేమించుటవలన మీకు మిత్రులు మెండగుదురు. మిత్రమహిమనుగూర్చి పెద్దలిట్లు వ్రాసిరి.

చ॥ క్షమకవచమ్ముక్రోధమది ♦ శత్రువుజ్ఞాతిహుతాశనుండుమి
త్రముదగుమందు దుర్జనులు ♦ దారుణపన్నగముల్ సువిద్య వి
త్తము చితలజ్జభూషణము ♦ దాత్తకవిత్వము రాజ్యమీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగు ♦ పట్టునదక్కవచాదు లేటికిన్ ॥ భ॥హ

తా॥ ఓరుపు కవచమువంటిది. కోపము శత్రువువంటిది. మిత్రము సిద్ధౌషధమువంటివాడు. దుర్జనులు పాములవంటివారు. మంచివిద్య విత్తమువంటిది. ఉచితలజ్జ భూషణమువంటిది. గాంభీరకవిత్వము రాజ్యమువంటిది. ఇటువంటి క్షమాదిగుణములేయుండు నెడల కవచాదులతో ప్రయోజనములేదని తాత్పర్యము.

* అవ్యభిచారముగా

ఆహా! కరుణాసముద్రుడగు భగవంతుడు యింతసులభములో మనకు సంతోషమనస్కులై యుండు మార్గమును చూపియుండగా దానిని స్వీకరించకపోవుట మన కర్మఫల విశేషముగాక మరేమని చెప్పవచ్చును. అయిననూ మీ స్వేచ్ఛవలన మీరు పరులను ప్రేమించు నభ్యాసమును కలుగజేసికొనినచో మీకు భగవంతుని యనుగ్రహము గలిగి యట్లు మీరితరులను ప్రేమించి సర్వదా యానందమును పొందుచుందురు. ఇహమందిట్లు గలుగుటయేగాక దీనిఫలము పరమందుకూడా గలుగుట సత్యము.

8. ప్రేమించుట యనుదానిని గొంచము వివరించెద. మీరు యితరులతో మాట్లాడునపుడు వారియందు నసూయతగలిగినటువంటిన్ని గర్వముగలిగినటువంటిన్ని మనస్సుతోగాక దయారసముగలమనస్సుతో, నగు మొగముతో అతివినయము లేక ఆదరణతో మాట్లాడవలెను. ఇతరులు కోరిన యుపకారములను చేతనయినచో చెయ్యవలెను. వీలుగానియెడల మృదువయినమాటలతో వీలుకాదని చెప్పవచ్చును. ఇట్లు ప్రతిమనుజుడును త్రివిధములయిన శరీర వాక్మనస్తపస్సులను జరుపవలెను. అవియేవనిన:—

శ్లో॥ దేవద్విజగురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవం
బ్రహ్మచర్యమహింసాచ శారీరం తప ఉచ్యతే॥

తా॥ దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, పెద్దలను పూజించుటయు, శుచి, కల్మషములేనితనము, నిషిద్ధస్త్రీగమనవర్జనము, ఇతరప్రాణులకు ఉపద్రవము చేయకయుండుట ఇవియన్నియు శరీరప్రధానమయిన తపస్సులని చెప్పబడుచున్నవి.

శ్లో॥ అనుద్వేగకరంవాక్యం సత్యంప్రియహితంచయత్
స్వాధ్యాయాభ్యసనంచైవ వాఙ్మయంతపఉచ్యతే॥

తా॥ ఇతరప్రాణులకు మనస్సునొప్పింపని ప్రీతివిశ్వాసములతో గూడిన యథార్థపుమాటలున్ను వేదాభ్యాసముచేయడమున్ను వాగ్రూపములయిన తపస్సులని చెప్పబడుచున్నవి.

శ్లో॥ మనఃప్రాసాదసౌమ్యత్వం
మౌనమాత్మవినిగ్రహః
భావసంశుద్ధిరిత్యేత
త్తపోమానసముచ్యతే॥

తా॥ మనస్సుకు తృప్తియైన మంచివృత్తిన్ని, మితభాషిత్వమున్ను, మనోనిగ్రహమున్ను, మనశ్శుద్ధిన్ని మనస్సంబంధమైన తపస్సులని చెప్పబడును.

ఐహికసంబాధమయిన యన్ని గొప్పతనములకును ఆస్పదమైన శ్రీరామచంద్రమూర్తివంటిరాజు సర్వజనులతో మధురముగాను ప్రియముగాను మాట్లాడినట్టును తన భృత్యులతో సహా బహువినయముగా మాట్లాడినట్టును, సీతాదేవిని పర్ణశాలయందు నొంటరిగా విడిచివచ్చుటవలన తనకు మహాపకారముజేసిన లక్ష్మణునితో అతిశాంతముగాను మృదువుగాను మాట్లాడినట్లు శ్రీమద్రామాయణమునందు శ్రీవాల్మీకులవారు వర్ణించియున్నారు.

శ్లో॥ బుద్ధిమాన్ మధురాభాషీ
పూర్వభాషీ ప్రియంవదః
వీర్యవాన్ నచవీర్యేణా
మహతాస్వేనవిస్మితః॥ రామా॥ 157

తాత్పర్యము॥ బుద్ధిమంతుడున్ను, తియ్యటిమాటలు మాటలాడువాడున్ను, యిష్టమగునట్లుమాటలాడువాడును, పరాక్రమశాలియున్ను గొప్పదయినను, తనపరాక్రమమునకు ఆశ్చర్యము పొందువాడు కాడు.

శ్లో॥ గృహీత్వాచకరంసవ్యం
లక్ష్మణం రఘునందనః
ఉవాచమధురోదర్క-
మిదంపరుషమాతురమత్॥ రామా॥ 158

తా॥ శ్రీరాముడు లక్ష్మణుని యెడమచేతిని బట్టుకుని ఆతనినిగూర్చి యీక్రిందవిధముగా మధురమయిన సంబోధనలతోను కఠినముగాను అయితే వ్యసనపూరితముగాను పలికెను.

శ్లో॥ అహో లక్ష్మణగర్హ్యంతే
కృతంయస్త్వంవిహాయతాం
సీతామిహాగతస్సౌమ్య
కచ్చిత్స్వస్తిభవేదిహ॥ రామా॥ 159

తా॥ సౌమ్యుడవయినయోలక్ష్మణా, అటువంటిసీతనువదలి నీవిక్కడకు రావడమనునది యెంతనిందనీయవిషయము? ఇంకా మనకు శుభము గలుగునా?

గనుక అల్పసంపత్తులుగల మనము మనతోడివారితోడను భృత్యులతోడను అతివినయముగాను దయారసయుక్తముగాను మాట్లాడవలెను.

ఉత్తమ, మధ్య, మాధమలక్షణములలో క్రమముగా దేనిననుసరించి మీరు ప్రవర్తించుటకు మీకు అవకాశము

ను ధైర్యమును కలదో అట్టిలక్షణప్రకారము మీరితరుల
ను ప్రేమించవలెను.

మ॥ తమకార్యంబు బరిత్యజించియు బరా♦ర్థప్రాపకుల్ సజ్జనుల్
తమకార్యంబుఘటించుచున్ బరహితా♦ర్థవ్యాపృతుల్ మధ్యముల్
దమకైయన్యహితార్థఘాతుకజనుల్ ♦ దైత్యుల్ వృధాన్యార్థభం
గముగావించెడు వారలెవ్వరొ యెరుం♦గశక్యమే యెరికిన్॥ 160

భ॥ హ॥

తా॥ తమకార్యములవిడిచి పరులకార్యములను చేయువారు సత్పురుషులు తమకార్యములకు భంగములేకుండ పరులకార్యముల నొనర్చువారు మధ్యములు తమకార్యమునిమిత్తమై పరులకార్యమును చెడగొట్టువారు మనుష్యులలో రాక్షసులు. తమకు నష్టము లేకపోయినను పరులకు నష్టముచేయువారల కేపేరు పెట్టవచ్చునో నాకు తెలియుటలేదు.

10 ఇతరులను ప్రేమించునప్పుడు మనమనస్సున కానందముగానుం డును. ఇతరులనుగురించి మనకాగ్రహముగాని అసూయత గాని కలిగినప్పుడు మన మనస్సునకు కష్టముకలుగునుగాని సుఖముగలుగదు.

11 ఇతరులుచేయు దుర్మార్గములనుజూచి అయ్యో వారు దుష్కర్మచేసి చెడిపోవుచున్నారుగదా యని వారియందు జాలిపడి వానిమనము సహించి వారలను మనము ప్రేమించు నభ్యాసము జేసకొనవలెను.

చ॥ నతులగుచున్ మహోన్నతిద♦నర్చుచు నన్యగుణోక్తిచేఁ గుణో
న్నతి ప్రకటించుచున్ బరజ♦నప్రియకార్యసమర్థతన్ సమం

చిత నిజకార్యసంగ్రహము ల్సేయుచు నిష్ఠురవాదులన్ క్షమా
ధృతి నిరసించుచున్పరగు ధీరులు పుణ్యులుగారె యేరికిన్॥ భ-హ॥ 161

తా॥ సత్పురుషులు అణుకువగలిగియే ఔన్నత్యమును పొందుదురు. పరుల గుణములనే శ్లాఘించుటచేత తమ సహృదయమును గనంబరుతురు. పరుల కార్యసాఫల్యమునకై ఎక్కువ ప్రయత్నించి వారికార్యమును సానుకూలము చేయుచు తమకార్యముల నొనర్చుచుందురు. తమ్ము కఠినముగను పరుషముగను నిందించు దుర్జనులయందు ఓర్పును గనంబరచుచునే వారిని దుఃఖపెట్టుదురు. ఇట్టి ఆశ్చర్యకరమగు నడవడిగల మహాత్ములు ఎవరికి పూజ్యులుగారు?

వారుచేయుదుర్మార్గమంతసహించగానిదైనచో అట్టివారి మేలుకొరకు అనగా వారికి నీతిదెల్పుకొరకు దండనాయకులతో జెప్పి వారిని శిక్షింపించుట న్యాయమేయగును. కాని అయ్యో! వారట్టి దుష్కృత్యములను చేసినందున శిక్షనుపొందిరిగదా యని తెలిసికొని యట్టియవస్థ మనకెన్నడు రాకుండునట్లు మన నడతను జాగ్రత పెట్టుకొని వారినిగురించి జాలిపడవలెను. గాని వారియందు తీవ్రమయిన దీర్ఘక్రోధమును కలిగియుండరాదు. అభ్యాసము వలన మనకిట్టి మార్పు కలుగునని యభ్యసించిన మీ కెకనగొనగలరు. అభ్యాసమున కసాధ్యమయినపనులుండుట యరుదు. అభ్యాసమహిమను గూర్చి శ్రీకృష్ణభగవానులిట్లు సాయించియున్నారు.

శ్లో॥ అసంశయం మహాబాహో । మనోదుర్నిగ్రహంచలం
అభ్యాసేనతు కౌంతేయ । వైరాగ్యేణచగృహ్యతే॥ భ॥ గీ॥ 162

12 ప్రేమించుటయను నొకదానివలన ననేకసుగుణములుగలిగియుండవలెనని తాత్పర్యమగుచున్నది. అబ్బా! ఇన్ని సుగుణములను స్వీకరించుట బహుకష్టము! యధైర్యపడవలదు. ప్రేమించుటను జరిపితీరవలెనను ప్రతిజ్ఞ మనము చేసికొనవలెను. ఇట్లు ప్రతిజ్ఞ చేసికొనినప్పుడు తదనుకూలమై

న సుగుణప్రవర్తన మనకు తప్పకనబ్బును. మధ్యమధ్యను యీప్రతిజ్ఞకు, కామ క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములనెడి అరిషడ్వర్గములవలనగాని, ధనేషణ, దారేషణ, పుత్రేషణలనెడి యీషణత్రయంబులవలనగాని, భంగముగలిగినను అంతటితో దానినివిడిచిపెట్టక పట్టుదలగలిగి నిజమైన పశ్చాత్తాపబుద్ధితో మనస్సునుచక్కజేసికొని యితరులను ప్రేమించుమభ్యాసమును కొనసాగించి తరించవలెను. ధీరులగువారు తమపట్టునువిడువక తమప్రతిజ్ఞ కొనసాగింతురు.

తే॥ గీ॥ తనిసిరే వేల్పులు దధిరత్నములచేత
వెఱచిరే ఘోరకాకోలవిషముచేత
విడిచిరేయత్న మమృతంబు వొడముదనుక
నిశ్చితార్థంబువదలరు నిపుణమతులు॥ భర్తృ॥ 168

తా॥ అమృతమునకయి పాలసముద్రమును మధింపుచున్న దేవతలు అందలి రత్నలాభమునకు సంతోషింపక అందుపుట్టిన కాలకూటవిషంబునకు భయపడక అమృతముకలుగునంతవరకు తమపట్టును వదలరైరి ధీరులెప్పుడు తాము దలంచినకార్య మగునంతవరకు ప్రయత్నమును వదలరు.

శా॥ ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
యారంభించి పరిత్యజింతురురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరురుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్॥ భర్తృ॥ 164

తా॥ అధములు విఘ్నములుసంభవించునని కార్యము నారంభింపవెఱతురు. మధ్యములు ఆరంభించి విఘ్నమువచ్చునపుడు వదలెదరు. ధీరులెన్ని పర్యాయము లెట్టివిఘ్నములువచ్చినను తాముపట్టినకార్యమును విడువరు.

"He can who thinks he can"

అని Mr O. S. Marden దొరవారు చెప్పియున్నారు కాబట్టి అట్టి ప్రతిజ్ఞ నిలుపుకొను నుపాయ మెద్దియనిన.

14 ప్రతిజ్ఞ ప్రకారము మనము ప్రతిరోజున నెరవేర్చుచున్నది లేనిది కనిపెట్టవలెను. అదియెట్లనిన- పగలంతయు మనమన ఉద్యోగములయందు మనకాలమును గడపి రాత్రి పరుండి నిద్రబోయెదము గదా. ఈనిద్రనుండి మనము వేకువఝామున లేచుట మొదట నభ్యాసము జేసికొనవలెను. ఇట్లు లేచి ప్రక్కమీదనుండియే మనలను సర్వదా రక్షించుచున్న భగవంతుని ప్రార్థించి, తరువాత గడచినపగటివేళయందంతయూ లోకులకు మన మొనరించిన ఉపకార, అపకారములను జ్ఞప్తికి దెచ్చుకొని, ఉపకారములు చేయగలిగినందుకు సంతసించి, అపకారములు జేసినందుకు పశ్చాత్తాపపడి యిక నెన్నడు యట్టియపకారముల చెయ్యనని మనస్ఫూర్తిగా దృఢనిశ్చయము చేసికొనవలెను. తరువాత వెంటనే వచ్చుదినమునందు చేయవలసిన పనులనుగురించి కొంచెము యోచనచేసి పిదప ప్రక్కనుండి లేవవలెను. ఇట్లు దృఢనిశ్చయము చేసికొనినతరువాత తిరిగి యట్టియకృత్యము నిజముగా చేయకున్న యెడనే, మీకులాభము కలుగును గాని లేనియెడల ప్రయోజనము కలుగనేరదు. మన కప్పుడప్పుడు ప్రతిజ్ఞభంగములు కలిగినను వానిని నిజమయిన పశ్చాత్తాపముతో సవరించుకొనినయెడల మనకు తుదకు తప్పక జయముకలిగి సుఖింతుము.

15 మన సంకల్పములనుబట్టి మనచేష్టలుండును. ఇంతజెప్పనేల మనబ్రతుకు యావత్తు వానినిబట్టియుండును. ఇందునుగురించి పెద్దలయినవా రొకరిట్లు చెప్పియున్నారు.

As a man's thought, so is his action. What a man thinks upon that he becomes. "యద్భావం తద్భవతి" To understand how to use thought properly and fully is to make ourselves masters of our destiny. We can make our own character what we like by thought and we have been told again and again how to do it. All that is required is steady & regular practice every day until the habit is established.

Let us go forward wearilessly with the determination that every experience even every failure, every mistake shall serve as a step in the endless ladder by which we shall un-fold our powers and climb to perfection.

కాబట్టి మనసంకల్పములు పరిశుద్ధముగా నుంచవలెను.

16 మరియు అబద్ధమాడకూడదు. జీవహింస చేయకూడదు పరస్త్రీపరధనముల కాశపడకూడదు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములకు లోబడకూడదు. అను విషయములలో నొక్కొక్క దానిని ప్రతినిత్యము యేకాంతస్థలమునందుగూర్చొని జపము (Meditation) చెయ్యవలెను. అనగా అచంచలమైనమనస్సుతో అనే

కసార్లు అనుకొని "సర్వేజనా స్సుఖినో భవంతు"*అను వాక్యమును చివరకు జెప్పి జపము ముగించవలెను. ఇట్లుజపించే అనగా నిత్యమూ అనుకునే మనుజుడు అట్టిదుష్టకార్యములను చేయను మరచి వానిజేయకుండును. ఇందునుగురించి మానవునియొక్క పట్టుదలగల ప్రయత్నమును బట్టి వానికి గెలుపుగలుగును. మరియు యీపట్టుదలనుగురించి శ్రీమద్రామాయణమునందు వాల్మీకులవారు బోధించిరి. సందర్భము: శ్రీరామచంద్రమూర్తి సీతామ్మవారి వియోగమునకు మిక్కిలిదుఃఖపడి నిరుత్సాహులై యున్న సమయంబున శ్రీలక్ష్మణస్వామివారు వారితోనిట్లనిరి.

శ్లో॥ ఉత్సాహోబలవానార్య నాస్త్యుత్సాహాత్పరంబలం
సోత్సాహస్యాస్తిలోకేస్మి న్నకించిదపిదుర్లభం॥ రామా॥ 166

తా॥ ఆర్యుడవయిన యోరామ! ఉత్సాహము బలవంతమయినది. ఉత్సాహముకంటె బలవత్తరమయినది మరియేదియు లేదు. ఉత్సాహవంతునికి పొందరానిది లోకమందేదియులేదు. అనగా సమస్తమును సాధ్యమగును.

శ్లో॥ ఉత్సాహవంతఃపురుషా నావసీదంతికర్మసు
ఉత్సాహమాత్రమాశ్రిత్య సీతాంప్రతిలభేమహి॥ రామా॥ 167

తా॥ ఉత్సాహవంతులయినపురుషులు కార్యములయందు వ్యసనమునుపొందరు. ఉత్సాహమునుమాత్ర మవలంబించినయెడల సీతను బడయగలము

---

* ఈ(Lecture) ఉపన్యాసముయొక్క ముఖ్యాభిప్రాయము యీవాక్యముయొక్క(spirit) బోధను, దీనిని చదివినవారును విన్నవారును సర్వకాలసర్వావస్థలయందును గమనించవలెనని యైయున్నది. దీనిచొప్పున నడుచుటయే ఇహసుఖసాధనము.

ఈవిధముగా ప్రతిమనుజుడును ఉత్సాహముగలిగి వీని నన్నిటిని కాలక్రమేణా జపించి (అనేకసార్లుఅనుకొని) సిద్ధిచేసికొనినచో అనగా అనుకొనినట్లు చేయగలిగినయెడల కృతార్థుడౌను. అనగా సకలసుగుణసంపత్తిగలిగి సత్స్వభావమునలన నితరులను సర్వదా ప్రేమించి తాను సుఖించును.

చ॥ అతనికివార్థి కుల్యయగు•నగ్ని జలంబగు మేరుశైలమం
చితశిలలీలనుండు మద•సింహము జింక తెఱంగుదాల్చు గో
పితఫణి పూలదండయగు•భీష్మవిషంబును ధారసంబగున్
క్షితిజనసమ్మతంబగు సు•శీలమదెవ్వనియందు శోభిలున్ ॥ భర్తృ॥ 168

తా॥ ఎవడు సత్స్వభావముగలిగియుండునో అట్టివానికి సముద్రము సన్నకాలువవలెను అగ్ని జలమువలె చల్లగను, మేరుపర్వతము చిన్నరాతివలెను, సింగము జింకవలెను, సర్పము పూలమాలవలెను, విషము అమృతము వలెను అగును.

ఇట్లు ప్రతినిత్యము నభ్యసించినయెడల సర్వశక్తిగల భగవంతుడు పైజెప్పినప్రతిజ్ఞ నెరవేరునట్లుప్రసాదించును. ఈ యభ్యాసబలమువలన మీరు యితరులనుప్రేమించి సర్వదా సుఖముగలవారై యుందురు. గనుక నిట్లభ్యసించి చూడగలందులకు మిమ్ములను ప్రార్థించుచున్నాను.

17 మరియు ఇతరులనుప్రేమించుట దైవకార్యమని యిదివరకు చెప్పియున్నాను. ఇందునుగురించి "ఏకనాథస్వాములవారి"యభిప్రాయ మిదియని Sir Ramakrishna Gopal Bhandarcur L. L. D. గారు చెప్పినదేమనగా:—

"God is worshipped and adored by means of kindness to every man and that when any man is despised God himself is dishonored."

ప్రతిమానవునియందు దయనుచూపించుటపూర్వకము గా భగవంతుడు పూజింపబడుచున్నాడు. ఏమనుష్యునిగాని అన్యాయతతో చూచినయెడల భగవంతుని అమర్యాద చేసిన వారమగుచున్నాము.

కాబట్టి యితరులను ప్రేమించుట దైవకార్యముగా నెం చి మనము సర్వదా యితరులను ప్రేమించి సుఖించవలెను.

18 Where there is will there is way ఏమిది చెయ్య వలెననిబుద్ధియుండునో అది చెయ్యుటకు మార్గముండును. గనుక యితరులను ప్రేమించుటయనుదానిని పురాణ, ప్రసూతి, స్మశాన, వైరాగ్యములవలె గాక సర్వదా జ్ఞాపకమునందుంచుకొని మనము తరించవలెను.

19 ఈప్రసంగము సర్వశక్తిగలభగవంతుడు మీకురుచింపజేసి మిమ్ములను కృతార్థులనుచేయుగాక యని యింతటితో విరమించుచున్నాను. 1 సర్వేజనాస్సుఖినోభవంతు. 2 సర్వేజనాస్సుఖినోభవంతు. 3 సర్వేజనాస్సుఖినోభవంతు.॥

వ॥ అని యీప్రకారము బోధించుచు శ్రీనునందనమహారాజా కాలముగడపెను. కాబట్టి నేను ప్రథమములో పాడిన "నినుసేవించిన" అను పద్యములోని "సేవ"శబ్ద

మునకు ప్రాణులను, ముఖ్యముగా, మనుజులను ప్రేమిం
చుట యనునది ప్రధానమయినదని తాత్పర్యము. 214

వ॥ సోదరులారా! 215

తే॥ గీ॥ ఇట్టిబోధలుసలిపెను యినకు లేశు
డైన శ్రీసునందను డల యైహికమును
మరియు నాముష్మికము నైన మంచిఫలము
గలుగ జేసిన బోధను గనరె మీరు॥ 216

క॥ ఈచరితముజదివినవా
రాచరణలు జక్క జేసి హార్షముమీరన్
నీచుల నధికుల సములను
యోచనతో ప్రేమజూపి యుండుటగలుగున్॥ 217

తే॥ గీ॥ ఇందు జెప్పినచొప్పున విలను నెవరు
జేసెదరొ వారు నిత్యము జెప్ప నలవి
గాని సుఖము సంపదలను గరిమగలిగి
బ్రతుకుదురు దైవకృపచేత ప్రబలముగను॥ 218

క॥ తెలియందని నేదెలిపితి
నిల బెద్దలనాశ్రయించి యెన్నో దినముల్
దెలిసినదానిని నేనిట
ఫలితార్థము "ప్రేమ"*యంచు బాగుగ వినరే॥ 219

---

* దీని సంపూర్ణార్థము చివరనున్న మాతృవృత్తమునగ నంబడును.

క॥ ఉండిననిజమును జెప్పితి
నిండగు ధైర్యమునుగలిగి నిపుణత లేకన్
మెండుగ వేడెద నార్యుల
దండిగ నాతప్పులున్న దయగావంగన్॥ 220

గద్యము.

ఇది, శ్రీమన్నారాయణపాదారవింద ధ్యాననిరతుండైన
తిమ్మనవంశ అయ్యన్న నామాఖ్యునిపుత్రుండగు
కొండలరాయునిచే వర్తమానకాలానుగు
ణ్యాత్యవసర బోధాయుతం బగు
శ్రీసునందనచరిత్రము

సంపూర్ణము.

తిమ్మన అయ్యన్న నాయుడుగారి కుమారుడు కొండలరాయని
చే రచియింపబడిన భక్త దీనాలాపాష్టాదశ

# గీతములు.

---

తే॥ గీ॥ ఏలయీలీల నాచేతఁ • జేలపనుల
సలుపఁగను జేసెదవు నీవు • సారసాక్ష
నీదు దయ యున్న నే నెప్డు • నీచమైన
పనులు జేయంగ నెట్లగు • పరమపురుష॥ 1

తే॥ గీ॥ తాను తనబుద్ధిచేత నే • తగినపనుల
జేయఁగలనంచు మదియందు • జింత జేయు
వారి నెల్ల రవిడనాడ • నచ్చుగాక
నీవెగతియన్న విడతురే • నెనరుదప్పి॥ 2

తే॥ గీ॥ త్రోవఁజూపరె జనులార • తొలఁగిపోక
నన్న యంధుని మాటల • నాలకించి
గ్రుడ్డివానిని చేబట్టి • గుంటలోకి
ద్రోచెదరె యెవ్వరైనను • ద్రోహులగుచు॥ 3

తే॥ గీ॥ నీదు సంకల్పమున నెప్డు • నిఖిలజగము
బుట్టి పెరుగంగ నశియించు • పూర్ణముగను
నిజముగా నెప్డు నామది • నిర్మలముగ
నుండ జేయంగ గొప్పటే • యురగశయన॥ 4

తే॥ గీ॥ ఇట్టిమహిమలుగలిగిన•నీశనీకు
పాదపద్మమెగతియని•భక్తిఁగోడ
నమ్మియున్నట్టి నామీద•న్యాయముగను
దయనుజూపకనుండుట•ధర్మముగునె॥ 5

తే॥ గీ॥ నీదెభారమటంచును•నెమ్మనమున
నమ్మియుంటినిసతతము•నగధరుండ
నన్నునడిపింప సన్మార్గ•నటనయందు
దేవ నీకన్న నాకొక•దిక్కుగలదె॥ 6

తే॥ గీ॥ గొల్ల వాడున్న జాడను•గొర్రెయెరిగి
ధైర్యముగదిరుగు నడవిలో•దగినరీతి
అంతమాత్రము లేద? యో•యమరవినుత
వింతజూడగ నగరె సా•మంతులకట॥ 7

ఆ॥ వె॥ నీవుబ్రోవకున్న•నెనరుంచినామీద
లావువాడనంచు•యీవులొసగ
పేరుగొప్పజూడ•యీనదిబ్బేగద
యన్నబిరుదునీకు•వన్నెకెక్కు॥ 8

తే॥ గీ॥ ధనములడుగంగ లేదయ్య•ధర్మమూర్తి
సంపదలగోర లేదయ్య•చక్రధరుడ
నిర్మలంబైనబుద్ధిసి•నెనరుగలిగి
నొసగుమనిగోరుచున్నాడ•నోసురేశ॥ 9

తే॥ గీ॥ కోటలాడింట నాచుట్టు•మేటిగాను
గట్టిగాగట్టి నడుమను•బెట్టినన్ను

దాటిరమ్మనిబిలువంగ•దగినరీతి
వచ్చుటకు శక్యమా కరి•వరదనాకు॥ 10

తే॥ గీ॥ పంజరమునందుపెట్టను•పండబెట్టి
చుట్టులోహాపుకమ్ములు•గట్టిజేసి
వట్టిమాటలచేతను•వానిబిలువ
వచ్చునెట్లగుబయటికి•వారిజాక్ష॥ 11

తే॥ గీ॥ ఆరుగురుదొంగలను క్రింద•నణగద్రొక్కి
యీషణత్రయమును మొద•లెగరగొట్టి
మూడుతాపములు నేనెప్డు•ముఖ్యముగను
జేయగనుశక్తి నియ్యవె•శ్రీశవేగ॥ 12

తే॥ గీ॥ పరుల కుపకారమొనరింప•భక్తితోడ
పుణ్యమనిజెప్ప కాదు దీని•బుడమియందు
పరులకును గీడుసలుపంగ•పాపమనుచు
బుధులునుడివిరి తొల్లి సు•బుద్ధిమీర॥ 13

తే॥ గీ॥ గానపుణ్యమునా చేత•కమలనాభ
సలుపగను జేయుమెప్పుడు•జక్కగాను
ఎందుగష్టముగలిగిన•నడచివైచి
మత్స్యములునీటికెదురెక్కు•మాడ్కి దోప॥ 14

తే॥ గీ॥ పాపమొనరించ నాకెందు•భయముమిగుల
కలుగజేయవె హృదయమందో•కమలనేత్ర
పులినిజూచిన నజములు•బొబ్బలిడుచు
భయముచేతను పరుగులు•బారునట్లు॥ 15

తే॥ గీ॥ ప్రాణులకు బ్రీతిజూపెడు • పరమబుద్ధి
మరియు నీధ్యాసగలిగిన • మానసమును
జ్ఞానమునునివి లేకున్న • గానలోల
ఎన్ని సంపదలుండిన • నేమిఫలము॥ 16

తే॥ గీ॥ ఎరుగుదునునీతు లెన్నెన్నొ • యోచిజూడ
జెప్పగలనయ్య వానిని • జేయలేను
మనసునిలువదు స్థిరముగ • మాయవలన
కరుగురీతిని ఘృతమగ్ని • దరికిజేర॥ 17

తే॥ గీ॥ గాన నీదయకొరకు నే • గాసిపడుచు
వేడుచున్నాడ యికనన్ను • విడువవలదు
ఏదిజూచిన నిలలోన • నెరిగితిరుగ
గలుగుదునో దానిజూపుమో • గరుడగమన॥ 18

తే॥ గీ॥ ఇట్లు బాపట్లపురి నంద • రెరిగినట్టి
ధరను నీదాసదాసుల • దాసుడనుర
రంగ! తిమ్మన కొండల • రాయుడనెడి
పేరుగలవాడ నీదయ • గోరువాడ॥

తిమ్మన కొండలరాయుడు.

23—6—14.

